# ఆంధ్రపత్రిక

317605



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 246 FRIDAY 9th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# చెన్నరాష్ట్ర విభజన సంఘ ప్రథమ సమావేశం



## కేంద్రప్రభుత్వ లేఖాంశాల స్థూల పరిశీలన

చెన్నపట్నం, డిసెంబరు 8: ఆంధ్రరాష్ట్ర విభజన సంఘంవారు నేడు 11 గం. ల నుంచి 1 గం. వరకు రెండుగంటల సేపు సమావేశమై కేంద్రప్రభుత్వ హోంశాఖవారు రాష్ట్రనిర్మాణము సందర్భము వ్రాసిన లేఖాంశములను స్థూలముగా పరిశీలించిరి. సభకు ప్రధాని కుమారస్వామిరాజాగారు అధ్యక్షత వహించిరి. శ్రీ ప్రకాశం, వెంకట్రావు, మంత్రి సంజీవరెడ్డి, టి. టి. కృష్ణమాచారి మంత్రి భక్తవత్సలంగారలు హాజరైరి. విభజన సంఘ కార్యదర్శి, విభజనశాఖ కార్యదర్శిఅయిన ఎస్. వెంకటేశ్వరన్ ఐ. సి. ఎస్. గారు గూడా హాజరైవుండిరి.

సమావేశానంతరం మద్రాసు ప్రచార మంత్రి భక్తవత్సలంగారు ఇటుల తెలిపిరి. "రాష్ట్ర నిర్మాణమును గూర్చి పరిస్థితులను సింహావలోకనము గావించితిమి. రేపు 11 గంటలకు తిరిగి సమావేశ మగుదుము. రేపటికి కొన్ని అంకెలు సిద్ధముచేయ గోరితిమి. తిరువాత 2 వ తేదీన మరల సమావేశమగుదాము. అప్పటికి మరికొన్ని అంకెలు రాగలవు. కొంతసేపు ఆర్థిక కార్యదర్శి టి. ఎన్. ఎస్. రాఘవన్ గారు హాజరై ప్రత్యేక బడ్జెటులను గూర్చి, ప్రస్తుత పరిస్థితులనుగూర్చి తెలిపిరి. ఈ సందర్భమున అవసరమైన లెక్కలు సిద్ధము చేయ గోరితిమి."

### చర్చాంశములు

• కేంద్రప్రభుత్వం హోం శాఖవారు జనవరి 26 వ తేదీలోపల 1935 భారత ప్రభుత్వ (అనుసరణ) చట్టం 290 సెక్షను

(4-వ పేజి చూడుడు)

## ఫార్మోజాదీవి స్వాతంత్ర్యావశ్యకత

### మెక్ఆర్థర్‌కు విజ్ఞప్తి

టోకియో, డిసెంబరు 8: ఫార్మోజా దీవికి స్వాతంత్ర్యం ఇవ్వవలసిందని ఫార్మోజా స్వాతంత్ర్యసమితి జనరల్ మెక్ఆర్థర్‌కు విజ్ఞప్తిచేసింది.

### డా॥ పర్‌చూరే అరెస్టు

గ్వాలియర్, డిసెంబరు 7: గాంధి హత్యకేసులో ఒక ముద్దాయిగా నుండిన డా॥ సదాశివపర్చూరే నేడు యిచ్చటికి 11 మైళ్లదూరమున నున్న పనిహారిలో అరెస్టు కాబడెను. హిందూమహాసభవారు యేర్పాటుచేసిన సభలో నుపన్యసించుటకై డా॥ పర్‌చూరే శివపురినుండి గ్వాలియర్ వెళ్లుచుండెను.

డా॥ పర్‌చూరే గ్వాలియర్ ప్రవేశింపరాదని జిల్లా మేజిస్ట్రేటు ఉత్తరువు గావించియుండెను.

### సెనేట్‌కు బళ్లారిజిల్లానుండి ఎన్నికలు

వాల్తేరు, డిసెంబరు 6: ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటుకు బళ్లారిజిల్లా స్థానిక సంస్థల పక్షిన ఎస్. రాజగోపాలాచారిగారు, కె. సుశీలాయిడుగారు (బళ్లారి పురపాలకసంఘ సభ్యులు) ఎన్నుకోబడ్డారు.

## "ఆర్థిక సంక్షోభంనుంచి దేశాన్ని బయటపడవేయాలి"

### రాష్ట్ర మత దురభిమానాలను విసర్జించాలని ప్రధాని నెహ్రూ ఉద్బోధ

న్యూఢిల్లీ, డిసెంబరు 7: "ప్రభుత్వోద్యోగాల్లోవున్న అన్ని వర్గాలవారున్నూ ప్రజల అన్ని విషయాల్లోను మార్గదర్శకులుగా వుండవలెను," అని పండిట్ నెహ్రూ నేడు ఒక రేడియోప్రసంగం చేశారు.

ఒక్క ఉద్యోగ విషయంలోనే గాకుండా గౌరవప్రతిష్ఠల విషయంలో గూడా వారికి మార్గదర్శకులౌతూ, రాష్ట్ర, మత, దురభిమానాలను విసర్జించి పనిచేయాలని ఆయన వారిని ఈ సందర్భంలో హెచ్చరించారు.

"దేశంలో అరాచకశక్తులు బయలుదేరుతున్నాయి, మతం పేరిట, కులం పేరిట, అవకాశవాదం పేరిట, బ్లాక్‌మార్కెట్ల పేరిట, పాపం దేశంలో పెరిగిపోతోంది. దీన్ని మనం పగలగొట్టాలి అంతేగాని గోళ్లుగిల్లుకుంటూ కూర్చోరాదు.

మహాత్మాగాంధి తలపెట్టిన పనిని పూర్తిచేయవలసిన భారం అందరిమీద వున్నదని ఆయన ఈ అవసరంలో ఉద్ఘాటించారు. ఆయన తలపెట్టినపని సగం పూర్తిఅయింది. తక్కినసగాన్ని పూర్తి చేసేదాకా మనం నిద్రపోగూడదు అని ఆయన హెచ్చరించారు.

చరిత్రాత్మకమైన ఈ కార్యభారాన్ని నిర్వహించడంలో అందరు స్నేహితుల్లాగా సైనికుల్లాగా పనిచేస్తూ, చేతులు చేతులూ కలిపి లక్ష్యాన్ని సాధించడానికి ఉద్యుక్తులు కావాలని పండిట్ నెహ్రూ ప్రజానీకాన్ని ఆదేశించారు.

నెహ్రూ బ్రాడ్‌కాస్టు పూర్తిపాఠం:

మిమ్మల్ని ఉద్దేశించి మాట్లాడగల్గుతున్నందుకు సంతోషం. గడిచిన మూడు సంవత్సరాల్లో మీలో చాలామందిని నేను కలుసుకోవడం జరిగింది. అట్టి సందర్భాలలో మీతో మాట్లాడడం, సంప్రతించడం, కలిసి పనిచేయడంగూడా సంభవించింది. వీలు బాటుచిక్కితే మీలో ప్రతిఒక్కరినీ కలుసుకొని, విషయాలు ఇంకా బాగా చర్చించి అవగతం చేసుకోగలసావకాశంవుంటేది అయినామనమంతా ఒకేలక్ష్యాన్ని మనస్సులో వుంచుకొని పనిచేస్తున్నవాళ్లం అవడంచేత, ఏమి జరగాలన్నా మనలో ఒకళ్ళని ఒకళ్ళు అర్థం చేసుకొని వ్యవహరించడంమీద ఆధారపడివుంది.

మీరు చాలా మంచివాళ్ళని చాలా మంది అన్నారు. కొంతమంది మిమ్మల్ని విమర్శించారు. ఒకొక్కవేళలో ఈ విమర్శ హద్దులు మీరిగూడా పోయింది. ప్రస్తుత పరిస్థితులలో ఇది అనివార్యం. హఠాత్తుగా పరిస్థితులు మారిపోయి, కొత్త పరిస్థితులు ఏర్పడి ఆ పరిస్థితులకు అనుకూలంగా మిమ్మల్ని మీరు దిద్దుకొనే సావకాశంగూడా అత్యల్పంగా వుండివున్న కారణంచేత ఇట్టిస్థితి ఏర్పడింది.

కాని మూడు సంవత్సరాల అనుభవం మీద నేను మీరు ఎటువంటివాళ్ళో తెలుసుకోగలిగాను. మీరు దేశానికి సర్వదా విధేయులుగా ప్రవర్తిస్తూనే వున్నారు. దేశాన్ని, మిమ్మల్ని ఆవరించిన కొత్తపరిస్థితులకు అనుగుణంగా మీరు మారిన విధము గూడా నన్ను బాగా ముగ్ధుణ్ణి చేసినది. పూర్వంకన్నా ఇప్పుడు మీరుఎక్కువగా, పనిచేయవలసిన అవసరం ఏర్పడింది. ఆపని మీరు శక్తి సామర్థ్యాలతో నిర్వహించారు.

దేశరక్షణ కార్యకలాపాల్లో నిమగ్నులైన ఉద్యోగస్థులు బహుకష్టాలు పడవలసి వచ్చింది. ఆ కష్టాలను ఓర్పుతో సహించి వారు దేశస్థుల మన్ననలను పొందగల్గారు. ఇదేకాకుండా మీరు స్వయంగా మంచి అనుభవాన్ని గడించి పూర్వంకన్నా ఆత్మవిశ్వాసాన్ని, పూర్వంకన్నా బలాన్ని పూర్వంకన్నా గొప్పతనాన్ని పొందగల్గారు.

దేశం విభక్తమైన కారణంగా ఏర్పడిన బహుసమస్యల బరువుతో కృంగి కృశించి ఉండడానికి సిద్ధంగా వుండగా దాన్ని నిలిపి, బలపరచి, ఆ సర్వసమస్యలను ఒక విధంగా పరిష్కారం చేయడంలో ఉద్యోగులలో అన్నివర్గాలవారితోపాటు మేము గూడా బహుకష్టాలు పడవలసివచ్చింది. ఇప్పుడు ఏదో సాధించాంగదా అని గర్వపడితే లాభంలేదు. అయినా, మనం ఇది

(4-వ పేజి చూడుడు)

### ఇండియా బిల్లుకు కామన్సు ఆమోదం

#### లార్డ్స్ సభకు నివేదన

లండను, డిసెంబరు 7: బ్రిటిషు కామన్సు సభలో భారతరిపబ్లిక్ ప్రతిపత్తి బిల్లు మూడవ ప్రతిపాదన ఎట్టి ఆక్షేపణా లేకుండా జరిగి, లార్డ్సు సభకు పంపబడింది.

బ్రిటిషు న్యాయచట్టం ప్రకారం ఇండియాకు ఇప్పుడున్న హక్కులూ, అవకాశాలూ రిపబ్లిక్ అనంతరంకూడాఅమలులో ఉండడానికి ఈ బిల్లు ప్రతిపాదితమయింది.

బిల్లు మూడవ ప్రతిపాదనచేస్తూ కామన్వెల్తు సంబంధాల కార్యదర్శి నోయెల్ బేకర్, "ఈ బిల్లుకు చూపబడిన ఆదరం మాకు చాలా సంతృప్తి కలిగిస్తున్నది. దానిని సభ్యులంతా ఏకగ్రీవంగా ఆమోదించడంవల్ల సత్ఫలితా లుండగలవు," అన్నారు.

### ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సమస్య

#### 11-వ తేదీన రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ చర్చ

విజయవాడ, డిసెంబరు 7: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం ఈనెల 11-వ తేదీన ఇక్కడ సమావేశమై ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యనుగూర్చి, [illegible] జిల్లాలలో తుపానుబాధిత ప్రాంతాలను గూర్చి చర్చలు జరుపుతుందని నేడు ఒక ప్రకటన చేయబడింది.

## 'ఆంధ్రరాష్ట్ర సత్వర నిర్మాణానికి కనీసచర్యలన్నీ జరపాలి'

### ప్రభుత్వ బాధ్యత: రంగాగారి ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 7: "ఆంధ్రరాష్ట్రనిర్మాణ క్రియాకలాపంలో, ఆలస్యానికి కారణం తామేనన్న నింద రాకుండా చేసుకోవాలంటే, మద్రాసు ప్రభుత్వం, 1950 జనవరి 26 వ తేదీలోపుగా ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించుటకు కనీసావసరమైన సమస్తచర్యలను గైకొనవలెను. మిగిలిపోయిన పెద్దపిన్న ముఖ్య సమస్యలను తరువాత పరిష్క-

(4-వ పేజి చూడుడు)





## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 8:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు పవరను 1-కి ఎక్స్ఛేంజి బోను సేల్సుటాక్సుతో సహా రు. 76 12-0 పెట్లా బంగారు తులం 114-12-0 మూసబంగారు 118-4-0 సీమవెండి తులం 100 కి (రెడి) 171-8-0 తులం 1-కి 1-12-0

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎక్స కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది. రు. 162-0-0 (కోరమాండల్) 163-0-0 (కాండిప్) వేరుసెనగనూనె ఎక్స పెల్లర్ (వీవరేజి) రు. 380-0-0 3టువర్% యఫ్. యఫ్. ఎ. సెంకొండనూనె (87 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వాలిటీ. రు. 33-10-9, 35-8-9

### ఆముదం

కాండి 500 పౌనులుగలది రు. 260, 265

### పంచదార

నక్కాటాగంజి (2అందరు) రు. 94-9-6
హాసన్‌పూర్ ,, రు. 94-7-10
మోతీపూర్ ,, రు. 93-14-0

## న్యూయార్కు ధరలు

న్యూయార్కు, డిసెంబరు 7.

డిశంబరు 30.39 / 30 39 మార్చి 30.34 / 30 35 మే 30.23 / 20.23 జూలై 29 71/29 71 అక్టోబర్ 28 19/బిడ్ 28.21 ఆస్కుడ్ డిశంబరు 28.09 / బిడ్ 28.01 ఆస్కుడ్ మార్చి 28.00 / బిడ్ 28.02 ఆస్కుడ్ మే 27.97 బిడ్ 27.99 ఆస్కుడ్

| | | |
|---|---|---|
| ఫిడ్లింగ్ | హాజరు | 30.99 |
| మార్చి | (గరిష్టధర) | 30.35 |
| | (కనిష్ఠధర) | 30.25 |

### మార్చివాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | వెల | 30.25 |
| నిన్న | | 30.29 |
| ,, ముగింపు | వెల | 30 34 |
| నిన్న | | 30 26 |

## ప్రధాని పర్యటన రద్దు

విజయవాడ, డిసెంబరు 6: తుఫాను బాధిత ప్రాంతాలలో మద్రాసు ప్రధాని కుమారస్వామి రాజాగారు యీ నెల 8 నుండి పర్యటిస్తారని లోగడ ప్రకటింప బడింది. ఈ పర్యటన రద్దు చేయబడినట్లు నేడు అధికారరీత్యా తెలియవచ్చింది.



## మదరాసు కార్పొరేషను

### పన్నుల అపీలు సంఘం రద్దుకు ప్రాతికూల్యం

మదరాసు, డిశంబర్ 7:—మదరాసు కార్పొరేషన్ కౌన్సిలు నిన్నటి సమావేశమునందు, పన్నులఅపీళ్ల సంఘం రద్దుచేయాలను మదరాసు ప్రభుత్వం వారి సూచనను నిరాకరించుచు తీర్మానించెను.

కార్పొరేషను పన్నులు హెచ్చించినచో రేటు పేయరులు అపీలు చేసుకుంటే విచారించి తీర్పు చెప్ప అధికారంగల ముగ్గురు కౌన్సిలర్లు(అందొకడు అధ్యక్షుడు) గల సంఘం గలదు. దీన్ని రద్దుచేసి స్మాలు కాజు కోర్టులో వేరొక జడ్జిని నియమించి, అపీళ్ళన్ని ఆతను విచారించినచో త్వరగ ఫైసలగునని, ఆ జడ్జి నియామకం ఖర్చులను గాను ప్రభుత్వమునకు కార్పొరేషను సాలీనా రూ, 12,000 యివ్వాలని, అప్రకారం సిటీ మునిసిపలు చట్టం సవరించెదమని ప్రభుత్వంవారు సూచించిరి. ఈసూచన ప్రజాపరిపాలన పద్ధతికి విరుద్ధమనియు, రేటు పేయరులకు రక్షణకొరకు చూపని కార్య నిర్వాహకోద్యోగులకు ఎక్కువ అధికారమిచ్చుననియు, పేదవారు స్వయముగా తమ ప్రతినిధులకు చెప్పకొని న్యాయంబడయుటకు వీలులేకుండా, వకీళ్లు కోర్టులవెంట తిరుగుట చాలకష్టమగుననియు అందచే చట్టం సవరింప రాదనియు రాధాకృష్ణపిళ్ళెగారు తీర్మానం ప్రతిపాదించగ అందరు సభ్యులు అంగీకరించగ ఆమోదించబడెను.

సాలీనా 15 లక్షలవొచ్చిన ఐదేండ్ల వరకు ప్రభుత్వంవారు కార్పొరేషనుకి గ్రాంటుయివ్వాలను కోర్కెను ప్రభుత్వంవారు నిరాకరించినందున, ప్రభుత్వంవద్దకు రాయబారం పంపవలెనని డా॥ ఎ. కృష్ణస్వామిగారు తీర్మానం ప్రతిపాదించగ కొంతచర్చ జరిగినాక అంగీకరించబడెను.

ఆశోకవిహారమునకు ప్రభుత్వం గ్రాంటును కోరుచును, కాంసరు నివారణనిధికి 15,000 ఒసంగుచును తీర్మానించ బడెను.

పి. ఆర్. నమ్మాళ్వారు వర్క్సుకమిటీ అధ్యక్షులుగను, జి. లోగనాథం హెల్తు కమిటీ సభ్యులుగను ఎన్నుకొనబడిరి.

కీ॥ శే॥ జమాలు మహమ్మదుగారి మరణమునకు విచారం తెల్పుచు తీర్మానించబడెను.

### తుఫానునిధికి రూ. 5,000.

గవర్నరు ఆంధ్రతుఫాను సహాయనిధికి రూ. 5,000 చందాయివ్వాలని తీర్మానించబడెను.

## విలేఖరులకు అర్థికమంత్రి అల్పాహారవిందు

మదరాసు, డిశంబరు 7: మదరాసు ప్రభుత్వ ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు నిన్నసాయంత్రము అడయార్, 'విజయవిహార్'లో స్థానిక పత్రికాసంపాదకులకు, విలేఖరులకు అల్పాహారవిందు ఇచ్చిరి.



# సంస్థానాలలో ఆదాయపు పన్ను వసూలు

## డా॥ జాన్ మత్తయిగారి బిల్లుపై భారత అధినివేశ శాసనసభలో చర్చ

న్యూఢిల్లీ, డిసెంబరు 7: ఈ వేళ ఇండియా పార్లమెంటు వాణిజ్యమంత్రి కె. సి. నియోగి ప్రతిపాదించిన నావికులకుసంబంధించినబిల్లును ఆమోదించింది. ఈ బిల్లులో ఇండియారేవులలో అంతటా నావికులకు ఉద్యోగావకాశాలు కల్పించే ఆఫీసులు ఏర్పాటు చెయ్యాలని ఉన్నది.

దీనివల్ల రెండుమూడులక్షల నావికులకు ఉద్యోగసహాయం లభించగలదనీ, ప్రస్తుతం నావికులకు ఉద్యోగాలిచ్చే పద్ధతిలో కలతోపాలు తొలగిపోగలదనీ తెలుస్తున్నది.

వాణిజ్యమంత్రినియోగి ఈవిషయంలో మాట్లాడుతూ, ఇండియాలోని రేవుస్థలాలలో అంతటా రెండుమూడు లక్షల నావికులు పనిలేకుండా పడిఉన్నారనీ దీనిని బట్టి, ఈ విషయంలో నిరుద్యోగ సమస్య ఎంతవరకు ఉన్నదో గ్రహించవచ్చుననీ అన్నారు.

యజమానుల, కార్మికుల సంఘాలు కలిసి, నావికులకు ఉద్యోగాలిచ్చే సంస్థలు ఏర్పాటు చేస్తేదానికి ప్రభుత్వంఅడ్డుపెట్టదనికూడా నియోగి అన్నారు.

ఆ పిమ్మట ఇండియా పార్లమెంటు డాక్టరు జాన్‌మత్తయ్ ప్రతిపాదించిన విలీన సంస్థానాల - ఆదాయపుపన్ను బిల్లును సెలెక్టుకమిటీ విచారణకు పంపడానికికూడా అంగీకరించింది.

ఈ విషయంలో జరిగిన చర్చకు సమాధానం చెబుతూ జాన్‌మత్తయి, సంస్థానాల్లో మహారాజులకు, పారిశ్రామికులకు జరిగిన ఏర్పాట్ల విషయమైన భోగట్టా సేకరించబడుతున్నదనీ, ఈ విషయంలో ఏమైనా ముదరా ఇవ్వవలసి ఉంటే అది 1949 ఆగస్టు 1వ తేదీనుంచీ ఇవ్వబడుతుందనీ అన్నారు.

ఆ పిమ్మట పార్లమెంటు నౌకాచట్టము దీపస్తంభ చట్టానికి సవరణబిల్లు, పారిశ్రామికుల తగాదా బిల్లు, ప్రేలుడు వస్తువుల బిల్లుకూడా ఆమోదించింది.

పార్లమెంటులో ఈవేళ జాన్‌మత్తయి ప్రతిపాదించిన, విలీనసంస్థానాలఆదాయపు బిల్లుపై చర్చజరిగింది. తరవాత దీన్ని ప్రత్యేకసంఘ విచారణకు పంపించాలనే ప్రతిపాదన కూడా ఆమోదింపబడినది.

దీనికి సంబంధించిన చర్చలో రాహూర్ కృష్ణసింగ్ మాట్లాడుతూ, ఈ చట్టంతో తాము పూర్తిగా ఏకీభవిస్తున్నామనీ, అయితే యు. పి. తో విలీనం చెయ్యబడిన టిహిరీ గర్వాల్ మొదలయిన ప్రస్థానాల్లో ఈ చట్టం అక్కడిప్రజల ఆర్థిక పరిస్థితులనుబట్టి అమలులో పెట్టాలనీ, అక్కడి ప్రజలు అప్పుడే అనేకమైన పన్నులవల్ల నానాబాధలు పడుతున్నారని, అందుచేత ఈ చట్ట 1951 ఏప్రెలు 1వ తేదీనించి అమలు జరపడం న్యాయమనీ అన్నారు.

భోపాలు ప్రతినిధి రాహూర్‌లాల్‌సింగ్ ఈ చట్టం 1950 నించే అమలులోకి రావాలని సూచించారు.

ఆ పిమ్మట సి. పి. సంస్థానాల ప్రతినిధి కిశోరీ మోహన్ త్రిపాఠిమాట్లాడుతూ ఈ కొత్తచట్టం ప్రకారం సామాన్య ప్రజలను పీల్చి పిప్పిచేసిన పెట్టుబడిదారులపై ఈ పన్ను విధింపబడుతున్నదనీ, అందుచేత ఈ ఆదాయపుపన్ను సంస్థానాలకు వర్తింపజేసినందుకు తాము ప్రభుత్వానికి కృతజ్ఞతా వందనాలర్పిస్తున్నామనీ అన్నారు.

కిశోరీ మోహనత్రిపాఠి ఇంకా ఇలాగ అన్నారు. "అయితే ఈ విధంగా వసూలు చేసిన ఈ ధనం సంస్థానప్రజల అభివృద్ధికి ఖర్చుపెట్టాలని కోరుతున్నాను. సంస్థానాల విలీనీకరణం జరిగినతర్వాత సంస్థానాల పరిపాలనలో లంచగొండితనము మొదలయినవి బాగాహెచ్చుపెరిగిపోతున్నాయి. ఈ విషయం చాలా జాగ్రత్తగా చమనించాలి."

ఆ తరవాత సారంగధరదాస్ మాట్లాడుతూ ఇది చాలాకాలం క్రితమే ప్రవేశపెట్టబడవలసిన చట్టమనీ, ఇంత ఆలస్యం అయినందుకు తనకు ఆశ్చర్యంగా ఉన్నదనీ అన్నారు.

తరవాత ఒరిస్సా ప్రతినిధి లక్ష్మినారాయణ సాహు మాట్లాడుతూ సంస్థానాల్లో వసూలుచేసిన ఆదాయపుపన్ను సంస్థానప్రజల శ్రేయాభివృద్ధికే ఖర్చుపెట్టాలనీ, ఇది ఇతరులకు ఖర్చుపెట్టడం అన్యాయమనీ అన్నారు.

అటుపిమ్మట హిమత్సింగ మాట్లాడుతూ, కొత్తగా స్థాపించే పరిశ్రమలకు కొన్ని సౌకర్యాలు కల్పించడం బాగున్నదనీ, అయితే ప్రస్తుతం ఉన్న పరిశ్రమలు తమ ఉత్పత్తి అభివృద్ధిచేస్తే వాటికి కూడా ఈ సౌకర్యాలు వర్తిస్తాయనే మాట స్పష్టంగా ఉండాలనీ అన్నారు.

అనంతరం డాక్టరు జాన్‌మత్తయి ఈ చర్చకు సమాధానం చెబుతూ ఇట్లాగ అన్నారు.

"ఈ బిల్లు ఇంతకు పూర్వమే ప్రవేశపెట్టకుండావుండడానికి కొన్ని కారణాలున్నాయి. ఈ మధ్య దాకా చాలా సంస్థానాలు సాంకేతికం భారత దేశంలో చేరలేదు. ఇంక సంస్థానాల ఆదాయం ఖర్చుపెట్టే విషయంలో చింతమన్ దేశముఖ్ గారిని ప్రత్యేక విచారణకు నియమించాము. అందుచేత ఆయన విచారణ పూర్తి అయ్యేదాకా నేనీ విషయంలో నేనే ఏమీ చెప్పదలచుకోలేదు."

ఆ పిమ్మట జాన్‌మత్తయి ఇంకామాట్లాడుతూ సంస్థానాల్లో భోగట్టా సేకరణ జరుగుతున్నదనీ, ఇన్‌కమ్‌టాక్సు ఉద్యోగులు ప్రజలతో సముచితంగా సహకరించేటట్లు చూస్తామనీ అన్నారు.

అనంతరం పార్లమెంటు ఈ బిల్లును ప్రత్యేక విచారణ సంఘానికి పంపించడానికి అంగీకరించింది.

## విద్యుత్‌సంస్థల బిల్లు

మదరాసు, డిసెంబరు 7: విద్యుచ్ఛక్తి సంస్థల బిల్లు సెలెక్టుకమిటీ నేడు ప్రభుత్వ కార్యాలయములో సమావేశమై బిల్లులోని మరగులన్నింటినీ, పరిహారము చెల్లించు పరతుతో సహా పరిశీలించిరి. పరిహారము చెల్లించు విషయములో ప్రధానమార్పులేమి కమిటీ సుముఖముగ లేనట్లు తెలియుచున్నది. కమిటీ రేపు మరల సమావేశమై అంత్యనిర్ణయములు చేయును.

## ఇండియాలో సైకిళ్ల నిర్మాణం

### కొత్త కంపెనీ స్థాపన

"సెన్-ర్యాలీ ఇండస్ట్రీస్ ఆఫ్ ఇండియా లిమిటెడ్" అను పేరిట ఒక కంపెనీ స్థాపనకు భారత ప్రభుత్వం అనుమతించింది. ఈ దేశంలో ర్యాలీ, హంబర్, రడ్జి, రాబిన్‌హుడ్, స్టర్మి ఆర్చర్‌తో సహా ర్యాలీమార్కులు గల సైకిళ్ళు, విడిభాగాలు తయారుచేసే ఉద్దేశంతో ఈ కంపెనీ స్థాపింపబడుతున్నది. ఈకంపెనీని భారతదేశంలోను, పాకిస్తానులోను సైకిల్ డీలర్లలో ప్రముఖులైన సెన్ అండ్ పండిట్ సైకిళ్ళుతయారుచేసే కంపెనీలలో ప్రపంచంలోకల్లా పెద్దదైన ర్యాలీ ఇండస్ట్రీస్ లిమిటెడ్‌వారి సహకారంతో, స్థాపించుతున్నారు. సెన్ రాలీఇండస్ట్రీస్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ కోటిరూపాయల అధికారముపొందిన మూలధనంతో రిజిస్టరు చెయ్యబడింది. ఇప్పుడు జారి చెయ్యబడుతున్నది. రు 50 లక్షలు వాటాలు హెచ్చుభాగం భారతీయుల చేతనే తీసికొనబడగలవని తెలుస్తున్నది. ఈ కంపెనీకి ర్యాలీ కంపెనీవారి తోడ్పాటు విశేషంగా ఉంటుంది. కంపెనీ డైరెక్టర్లలో ముగ్గురు ర్యాలీ ఇండస్ట్రీస్ లిమిటెడ్ కంపెనీవారై ఉంటారు. టెక్నికల్ కంట్రోలుకూడ వారికే ఉంటుంది.

కలకత్తాకు 150 మైళ్ళ దూరంలో అసన్ సోల్‌వద్ద ఫ్యాక్టరీకి గాను స్థలం సేకరించబడింది. సాధ్యమైనంత త్వరలో ఫ్యాక్టరీ నిర్మాణం జరగగలదు. 1951 లో ఉత్పత్తి ఆరంభంకాగలదని తలుస్తున్నారు.

ర్యాలీ కంపెనీవారి నాణ్యతా ప్రమాణాలతో ర్యాలీ ఇండస్ట్రీస్ ట్రేడ్ మార్కులు గల సైకిలు అనూలాగ్రం ఇండియాలోనే తయారుచెయ్యటం ఈ కంపెనీ లక్ష్యం. ఇది, అంచ లంచలుగా కొనసాగింపబడుతుంది. ప్రారంభంలో ఫ్రేములు, ఫోర్కులతయారీ ఎనామెలింగు, లైనింగు పనులు ఇక్కడచేసి, మిగిలిన భాగాలు దిగుమతి చేసి అసెంబ్లీ చేస్తారు. ఆరంభంలో సంవత్సరానికి 50,000 సైకిళ్ళు ఉత్పత్తి అయేట్లు ఫ్యాక్టరీ డిజైను చెయ్యబడుతుంది. కాని సాలుకు ఉత్పత్తి 150,000ల సైకిళ్ళ వరకు కూడా విస్తరించుటానికి అవకాశం కలుగజేస్తున్నారు. ఇంకా అవసరమైతే సంవత్సరానికి 2 50,000 సైకిళ్ళ వరకూ అభివృద్ధి కావటానికి సరిపోయే స్థలం సైన్లు ఏర్పాటు చేయబడి ఉన్నవి.

సెన్-ర్యాలీ ఇండస్ట్రీస్ ఆఫ్ఇండియా లిమిటెడ్ ఇండియా పాకిస్తాన్‌లలో ర్యాలీ ఇండస్ట్రీస్ ప్రొడక్టులకు సోల్‌డిస్ట్రిబ్యూషన్‌హక్కులుకూడా తీసుకున్నారు ఇందువల్ల, ఫ్యాక్టరీ ఆరంభించటానికి ముందే, మంచి రాబడి కలగటానికి అవకాశం ఉంది.

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 10 శనివారం

### మద్రాసు (ఎ)

ఉ 7-30 మంగళం రామమూర్తి పాట. 8. ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయసంగీతం (రి) 8-30 మద్రాసు (బి) వలె. మ. 1 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా రికార్డులు. 4-0పిల్లల కార్యక్రమం. ఆంగ్లమున. 4-30 పాశ్చాత్యసంగీతం (రి) సా. 5-30 జె. నీల వీణ. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 కె. ఆర్. లక్ష్మి పాట. 7 స్నేహలత సితార్. 7-30 గీతమంజరి(రి). 7-45 ఎం. ఎం. దండపాణిదేశికర్ పాట. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 ఆంగ్లప్రసంగం. 9-30 మద్రాసు (బి) వలె 10 పాశ్చాత్యసంగీతం (రి).

### మద్రాసు (బి)

ఉ. 7. తెలుగున వార్తలు. 7-15 అరియకుడి రామానుజయ్యంగార్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 బాలానందం. నిర్వహణ. న్యాపతి కామేశ్వరి. మ. 1 మహిళామండలి ప్రమాదం సుమా. స్నేహితురాలికి అరువియ్యడం. ప్రసంగం. కె. వి. మాణిక్యం. మహిళాలోకం. 1-30 మద్రాసు (ఎ) వలె. 1 50 తెలుగున వార్తలు 4 మద్రాసు (ఎ) వలె. సా 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం. స్వరాజ్యం సురాజ్యం కావాలంటే అందరికీ ఆరోగ్యం డాక్టరుగారి ప్రసంగం. విశేషాలు. ప్రకటనలు. ధరలు. వాతావరణ వివరాలు. 7 తెలుగున వార్తలు. 7-15 ఫిలింసంగీతం (రి). 7-45 మద్రాసు (ఎ) వలె. 9 30 తురయూర్ రాజగోపాలశర్మ రికార్డులు. 9-45 కె. వి. నాయుడు ఆర్కెస్ట్రా 10 శాస్త్రీయ సంగీతం (రి).

### విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు. 7-15 మహారాజపురం విశ్వనాథయ్యర్ రికార్డులు. 7-30 చెరుకుపల్లి సత్యనారాయణ శాస్త్రి వేణువు 8 ఆంగ్లమున వార్తలు. 8-15 శ్రోతలుకోరిన పాటలు, రికార్డులు. 8-30 గాచపూడి సీతారావు పాట. 1-0 శ్లోకాపఠం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 4-0 బొమ్మరిల్లు సహనము. నాటిక కాకి కోకిల పాట మన పరిసరాలు అరటితోట తపాలసంచి సా 5-30 చెరుకుపల్లి సత్యనారాయణశాస్త్రి వేణువు. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి బి. రాజరత్నం రికార్డులు 6-30 గ్రామస్థుల కార్యక్రమం (రి). 7 తెలుగున వార్తలు. 7-30 ఉభయకుశలోపరి శ్రోతల ఉత్తరాలకుజవాబులు. 7-45మద్రాసువలె. 9 ఆంగ్లమునవార్తలు. 9-15 ఆంధ్రదేశ జానపద గేయాలు కూర్పు దర్శన గుడిపూడి ఇందుమతీదేవి. 9-30గానసుధ (రి). 9-40 వి.అన్నపూర్ణ. ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా.

### హైద్రాబాదు

ఉ 7-30 బి. ఆర్. దేవ్ ధార్ ఖయాల్ దేస్కార్. 8-0 ఆంగ్లమున వార్తలు. (ఎ ఐ. ఆర్. రిలే) 8-20 ఎం. ఎస్. సుబ్రహ్మణ్యం కర్ణాటక సంగీతం. 8-50 తెలుగునవార్తలు. 9-15 బిబ్బోబాయి తుమ్రి ఘజల్ మ 12-30 ఆషా రికార్డులు 1-0 భక్తి గీతాలు రికార్డులు 1-20 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు (ఎ. ఐ ఆర్. రిలే) సా 5-0 బి. ఆర్. దేవ్‌ధార్ 5-20 బిబ్బోబాయ్ దాద్రాఘజల్ 5-35 ఆరిఫ్ రవూఫ్‌దాద్రాఘజల్ 6-30 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున వ్యవసాయం (9) చెరువులక్రింద వ్యవసాయం ప్రసంగం. వి. సుబ్బరాజు 7-0 తెలుగున వార్తలు (ఎ ఐ. ఆర్. రిలే)7-15పురాణం 7-55 ఆరిఫ్ రవూఫ గీత్ 8-30 బి. ఆర్. దేవ్‌ధార్ ఖయాల్ 8-45 ఎం. ఎస్, సుబ్రహ్మణ్యం కర్ణాటక సంగీతం 9-0 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ.ఆర్. రిలే) 9-15 శేషగిరి కిదాల్ శ్రోతల ఉత్తరాలకు జవాబులు 9-30 బిబ్బోబాయ్ ఘజల్. 9-55 ఆరిఫ్‌రవూఫ్ ఘజల్ గీత్. 10-5 బిబ్బోబాయ్ తుమ్రీఘజల్. 10-20 బి. ఆర్. దేవ్‌ధార్ ఖయాల్. 10-50 బిబ్బోబాయ్ దాద్రా.

## ఆంధ్రరాష్ట్ర ప్రత్యేక బడ్జెటు అంచెనాలు

### విద్యాశాఖ వ్యయం

చెన్నపట్నం, డిసెంబరు 7: ఆంధ్రరాష్ట్రానికి అన్ని శాఖలలోను ఆయవ్యయాల అంచెనాలను ప్రభుత్వంవారు తయారుచేయిస్తున్నారు. ఏప్రిల్ 1 వతేదీ నాటికి బడ్జెటుకు ఏర్పాటులు జరుగుచున్నవని మంత్రులు చెప్పుచున్నారు. రాష్ట్ర బడ్జెటు అంచెనాలు తయారు చేయించు జాగ్రత్తపడుచున్నారు. మద్రాసుకు ప్రత్యేకంగా లెఖ్ఖలు తయారు చేయుచున్నారు. ఆంధ్రరాష్ట్రములో విద్యకై వచ్చే సాలున 3 కోట్ల 20 లక్షలు, తమిళరాష్ట్రమున 5 కోట్ల 20 లక్షలు మద్రాసు నకు 79 లక్షలు రూపాయలు వ్యయం కాగలదని అంచెనాలు విద్యా శాఖవారు తయారుచేసినటుల తెలియుచున్నది.

### గౌ॥ సీతారామ రెడ్డిగారి కార్యక్రమము

మదరాసు, డిసెంబరు 5: మదరాసు రివిన్యూమంత్రి శ్రీ సీతారామ రెడ్డిగారు 8 తేదీ ఉదయం బొంబాయి ఎక్స్‌ప్రెస్ లో కడపవెళ్లి వరదదెబ్బతిన్న ప్రాంతమును చూచెదరు. 9 తేదీ ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, యర్రగుంట్ల 10 తేదీ ఉదయం మదరాసు చేరెదరు.

# ప. గో. జిల్లాలో 32 వేల ఎకరాల భూమికి అదనపు సాగుసౌకర్యాలు

## మంత్రి భక్తవత్సలంగారి వివరణ

నిడదవోలు, డిసెంబరు 5: మద్రాసు రాష్ట్ర పబ్లికు వర్క్సు శాఖా మంత్రి శ్రీ భక్తవత్సలంగారు ధవళేశ్వరం నుంచి నిన్న వుదయం విజ్జేశ్వరంమీదుగా యీ గ్రామం ప్రవేశించిరి. విజ్జేశ్వరంవద్ద జిల్లా కలెక్టరు జనాబ్ షేక్ అహ్మదుసాహెబ్ గారు, తదితర అధికార, అనధికార ప్రముఖులు స్వాగత మొసంగిరి. కానూరు ప్రాజెక్టు స్కీమునుగూర్చిన వివరము లన్నియూ, ప. గో. ఎగ్జిక్యూటివ్ యింజనీరుగారు మంత్రిగారికి తెల్పిరి. అనంతరం మంత్రిగారు పరివార సమేతంగా నందమూరు టన్నెల్ పరిశీలన చేసివచ్చిరి.

మధ్యాహ్నం 3 గంటలకు బహిరంగ సమావేశము జరిగెను. మంత్రిగా రధ్యక్షత వహించిరి. అల్లూరి సత్యనారాయణరాజు, గొట్టుముక్కల వెంకన్న, శ్రీమతి అమ్మన్న రాజా, మాగంటి బాపినీడు గార్లున్నూ, మోతే నారాయణరావు, ఎ. గోవిందాచారి జిల్లా కలెక్టరు, మద్రాసు రాష్ట్ర పి. డబ్ల్యు. డి ప్రధాన యింజనీరు ఎ. ఇ. వెంకటాచారిగార్లున్నూ, జిల్లాలోని వివిధ శాఖోద్యోగులును సభ నలంకరించిరి. జిల్లాలో అనేక ప్రదేశములనుండి సుమారు 1000 మంది రైతు ప్రతినిధులు సభకు వేంచేసిరి.

తాలూకా కొకరిద్దరు చొప్పున రైతు ప్రతినిధులు తమ కష్టములనుగూర్చి మంత్రిగారికి విజ్ఞాపనలు సమర్పించిరి. అనంతరం ప్రధాన యింజనీరు వెంకటాచారిగారి టుపన్యసించిరి. "మీ వినతి పత్రములలో కొల్లేరు నీరు సాగు చేయ్యాలన్నారు. కొల్లేరు ఒక పెద్దచెర్వు ఆచెర్వు నీరు సాగుకు తీసుకురావాలంటే 40 మైళ్లు కాల్వలు తవ్వాలి. అంతదూరం ప్రవాహం సాగదు. తర్వాత బుడమేరు, తిమ్మిలేరు, ఎర్రకాల్వలకు రిజర్వాయర్లు కట్టించాలన్నారు. యిది సాధ్యమే. దాని విషయమై అమెరికా, ఇంగ్లండులలోని యింజనీర్లతో సంప్రదించుచున్నాము. అంచనాలు తయారయ్యాయి. కొలది కాలంలోనే పని పూర్తవుతుంది. ఇక నక్కల కాల్వ, భగ్నేశ్వరం, యనమదుర్రు కాల్వల మరమ్మతు విషయంలో, వాటి గట్లు మరమ్మతు చేయించాలి. అదికూడా త్వరలోనే పూర్తి చేస్తాము. ఇక 2వ పంటకు 2 మాసములు మాత్రమే వ్యవధి వుంది. ఈలోగా పై కార్యాలు సాధ్యంకావు. ఈ జిల్లాలోనే రెండుపంటలకు సాగుకు నీరు మంజూరు చెయ్యాలన్నారు. అది సాధ్యంగాని పని. ఒక నిష్పత్తి ప్రకారం నీరు యిచ్చే విధానం కూడదన్నారు. అట్టి విధానం లేనిరోజున కాల్వ చివరల వున్న వారికి నీరు అందదు. ఆకారణంగా అదీ సాధ్యం కాదు. మీరందరూ రొటేషను వుంచాలన్నారు. అది ఆప్రకారమే చేస్తాము."

అనంతరం అల్లూరి సత్యనారాయణ రాజుగారు ఉపన్యసించుతూ రొటేషన్ జోనుకు తాము వ్యతిరేకులమని అసత్య ప్రచారం జరుగుచున్న దనిన్ని, తాము పూర్తిగా దానిని సమర్థించామనిన్ని కలెక్టర్ గారితో రొటేషన్ తీసివేయ వీలులేదని గట్టిగా తాము చెప్పామని అన్నారు.

అనంతరం మంత్రిగారు ఆంగ్లమున వుపన్యసించిరి. దానిని జిల్లాకలెక్టరుగారు తర్జుమాచేసిరి. "మీ జిల్లాలో యీమధ్య వచ్చిన తుపానువల్ల మీలో చాలామంది అనేక విధముల నష్టపోయినందుకు చాలా విచారిస్తున్నాము. నీటిసరఫరాలవిషయమై ప్రధాన యింజనీరుగారున్ను, అల్లూరి సత్యనారాయణగారున్ను ఉపన్యసించారు. మీరు నాకిచ్చిన వినతిపత్రములలో చాలా అసందర్భాలున్నాయి. మేము కూడా రొటేషన్ జోన్ తీసివేయుట కిష్టులము కాము. కాని మావుద్దేశ్య మేమంటే అది పూర్తిగా యీసంవత్సరమునకు తగ్గించి నష్టపడ్డవారికి యివ్వాలను కున్నాము. దానికి మీరంగీకరించలేదు. ప్రభుత్వం యెవరికిన్నీ లక్ష్మీ ధనం యివ్వదు. కాని మీరుకూడా ప్రభుత్వంతో సహకరించి వారికష్టం గుర్తించాలి. రెవిన్యూ అధికారుల అంచనాల ప్రకారం యీ జిల్లాలో పూర్తిగా నష్టపోయిన భూమి 74 వేల ఎకరాలు. అందు 29 వేలు రొటేషన్ జోన్లోవుంది. ఇంకా 45 వేల ఎకరాలువుంది. ఇంతభూమికీ కావలసిన నీరు లేదు. ప్రతిసంవత్సరం 25 లగాయితు 30 వేల ఎకరాలవరకు అదనపు సాగుక్రింద మంజూరవుతోంది. ఈసంవత్సరం యెంతో కృషిచేసి 32 వేలవరకు పెంచాము. అంతకన్న అధికంగా యిచ్చుటకు వీలులేదు. అవిధంగా పూర్తిగా నష్టపోయిన భూమిలో 61 వేల యెకరములు సాగవుతూంది. ఇంకా 13 వేలు మిగులుతుంది. ఆ ప్రాంతానికి ప్రభుత్వం యేవిధంగానూ సహాయం చేయలేదు. అదనపు 32 వేల ఎకరములు కలెక్టరుగారు నిర్ణయిస్తారు. ఆ నిర్ణయించడంలోకూడా నష్టాన్ని బట్టి అందరికీ న్యాయం కలిగేటట్లు నిర్ణయిస్తాము. ఇదికాక ఇంకా యేమైనా చెయ్యగలిగితే మీ ప్రతినిధులతో ఆలోచించి మీకు చెయ్యగలిగినదంతా చేస్తాము. కాని మీకొక్క విషయం చెప్తాను, మీ కెంతైతే మంజూరు చేశారో అంతే కాని అదనంగానూ, అక్రమంగానూ, ఒక్క యెకరమైననూ సాగుచేయకూడదు. అలా అక్రమ సాగుచేస్తే కఠినచర్యలు తీసుకొనవలసి వచ్చును." అని వుపన్యసించిరి.

తరువాత మంత్రిగారు జిల్లాలోని వివిధ శాఖోద్యోగులతోనూ శాసన సభ్యులతోనూ, నీటి సరఫరా సంఘ సభ్యులతోనూ సమావేశమై వారి సలహాలనడిగిరి. గోవిందాచారిగారు (ఎమ్. ఎల్. సి) మొత్తం నష్టపడ్డ భూమికంతటికీ 2వ పంట యివ్వవలెననిరి. దంతులూరి నారాయణ రాజుగారు పంపింగు స్కీము ప్రకారం అంతా సాగుచెయ్యవచ్చుననీ అది తాము అనుసరించు చున్నామని సూచించిరి. అల్లూరి సత్యనారాయణ రాజుగారు అక్రమ సాగుచేయకుండా ఒక ఆర్డినెన్సు జారీ కావలెనని సూచించిరి. ప్రధాన యింజనీరు వెంకటాచారిగారు 32 వేల యకరములకన్న అదనంగా యిచ్చే యెడల నష్టం వచ్చునని సూచించిరి. అతర్వాత 32 వేల ఎకరాలుమాత్రమే అదనపుసాగుకు మంజూరు చెయ్యవలసినదిగానూ, ఆ అదనపు సాగుభూమిని వెంటనే కలెక్టరుగారు నిర్ణయము చేయవలెననీ తీర్మానించిరి.

ఈ ఉదయం మంత్రిగారు పరివారసమేతంగా విజయవాడ వెడలిరి. స్వ. వి.

# మునిసిపల్ కౌన్సిళ్ల సంస్కరణ

## ప్రభుత్వమునకు సలహా సంఘ సిఫార్సులు

మదరాసు, డిశంబరు 7: మ్యునిసిపల్ కవున్సిళ్ల పరిపాలనా సంస్కరణలను సూచించుటకు నియమించబడిన సలహా సంఘము నేడు శ్రీ సి. యస్. రత్నసభాపతి మొదలియార్ అధ్యక్షత క్రింద సమావేశమై మ్యునిసిపలు కవున్సిల్ ఛైర్మనే కవున్సిల్, కార్యవర్గ అధ్యక్షుడుగా వుండవలెననీ, కమీషనర్ పేరును దీనస్య ఆఫీసరని మార్చవలెననీ, రివిన్యూ అఫీసరు, హెల్తు ఆఫీసరు, విద్యాధికారి ఇంజినీర్లను కమీషనరోకు బాధ్యులు చేయవలెననీ సిఫార్సు చేయుటకు నిశ్చయించిరి.

### తుపాను బాధితులకు ద. ఆఫ్రికా భారతీయుల సానుభూతి

మదరాసు, డిసెంబరు 7: దక్షిణాఫ్రికా దర్బానులోని హిందూ యువజన సంఘము, నెటాలు భారతీయ సంఘముల వారు ఇటీవల ఆంధ్రదేశములో తుపానువలన కల్గిన ఆస్తి, ప్రాణనష్టములకు చింతిల్లుచు మదరాసు గవర్నరు మాన్యశ్రీ భావనగర్ మహారాజావారికి సానుభూతి సందేశము పంపిరి. సానుభూతి వెల్లడించిన పై సంస్థలకు కృతజ్ఞత తెలుపుచూ గవర్నరుగారు ప్రత్యుత్తరము పంపిరి.

# చెన్నరాజధానిలోని సంస్థాన ప్రాంతములు

## సరిహద్దుల సర్దుబాటుపై ప్రభుత్వ నిర్ణయం

మదరాసు, డిశంబరు 7: మంత్రివర్గము నేడు శ్రీ ప్రధాని కుమారస్వామిరాజా గారి అధ్యక్షతక్రింద సమావేశమై చెన్నరాజధానిలోని సంస్థానగ్రామములు, చిన్న చిన్న ముక్కలన్నీ కలుపుకొనీ సరిహద్దు సర్దుబాట్లుగురించి నిర్ణయించెను.

ఈ నిర్ణయఫలితముగా ప్రస్తుతపు మన భాగాలు సుమారు 35 వేల యకరములు మైసూరుకు, 25 వేల యకరములు హైదరాబాదుకు పోయి మనకు మైసూరునుండి 9 వేల యకరములు, హైదరాబాద్ నుండి 40 వేల యకరముల ప్రాంతము వచ్చును.

లింగగిరి, ములుగుమాడు, మల్లవరం, రొంపిమళ్ల వగైరా 25800 యకరముల ప్రాంతము 9 వేల జనాభాగలది హైదరాబాద్ కు పోయి 20 వేల జనాభా 40328 యకరముల విస్తీర్ణము గల పరిటాలవగైరా గ్రామములు, ఈస్తపల్లి, గంగుపాడు మల్లవల్లి, ఫుల్లపాడు గ్రామములు మదరాసు ప్రభుత్వముక్రిందికి వచ్చును.

71000 యకరముల విస్తీర్ణముగల మన గాల మన రాష్ట్రముక్రిందే వుండగలదు.

మైసూరు ప్రాంతములో అనంతపురం జిల్లానుండి కంజనహాళ్ళి, కొట్టగాళ్లహాళ్లి, మడకశిరతాలూకాలోని కొన్ని చిన్న గ్రామములు, హిందూపురం తాలూకాలోని శాంతికంటపల్లి దక్షిణకనరానుండి హెబ్బిగి, నాగోడి, మరొక గ్రామము, సేలంనుండి హోసూరుతాలూకానుండికలన్, మొరనూర్, విట్టగడి, మరి 3 గ్రామములను మైసూరు ప్రభుత్వమునకు ఇచ్చుటకున్నూ, కోయంబత్తూర్ లోని బసగలాపురం, చిత్తూరులోని బౌరింగ్ పేట తాలూకాకు చెందిన 1300 యకరములు, బళ్ళారిలో హుడ్ బిగి, సేలంజిల్లాలోని కళదాతీపుర మైసూర్ ప్రాంతము మదరాసు ప్రభుత్వముక్రిందికి తీసుకొనుటకున్నూ అంగీకరించిరి.

పై మార్పులను ఉటంకించుచు గవర్నరు వుత్తర్వు చేసినదరిమిలా జనవరి 26 నుండి మార్పులు అమలులోనికి రాగలవని తెలియుచున్నది.

### నిర్బంధ పొదుపువిధానం

చెన్నపట్నం, డిసెంబర్ 7: రైతుల దగ్గరనుంచి నిర్బంధ పొదుపుపద్ధతిన డబ్బు వసూలుచేసే బిల్లునుగూర్చి మద్రాసు మంత్రివర్గంవారున్నే నేడు చర్చించిరి. బిల్లు తయారుచేసి, కాంగ్రెసు పార్టీకి పంపించెదరు.

### గుర్రపుపందేలని షేధం బిల్లు

గుర్రపుపందేల నిషేధంబిల్లు 1951 ఏప్రిల్ 1 వరకు అమలు జరుగుటకు మద్రాసు మంత్రివర్గంవారు తీర్మానించిరి.

### ఇంజనీరింగు ప్రదర్శనం

డిసెంబరు 29 న గిండీ ఇంజనీరింగ్ కాలేజిలో జరుగబోవు ఇంజనీరింగు ప్రదర్శనమును భారత ప్రభుత్వమంత్రి ఎన్. వి. గాడ్గిల్ గారు ప్రారంభించెదరు.

### గాంధీ స్తూపం

మద్రాసు బీచిలో సెనెట్ హౌసుకు ఎదురుగా గాంధీ స్తూపం నిర్మించుటకు మద్రాసు మంత్రివర్గంవారు తీర్మానించిరి.

# 'యకరానికి రు 200 లకు తగ్గకుండా దీర్ఘ వాయిదా పద్ధతిని అప్పులివ్వాలి'

## తూర్పుగోదావరిజిల్లా లంకరైతుల తీర్మానం

కోటిపల్లి, డిశంబరు 6: తూర్పు జిల్లా లంకరైతుల మహాసభ అమలాపురం తాలూకా వీరవల్లిపాలెంలో మొన్న సాయంకాలం 2 గం. కు జిల్లా కాంగ్రెస్ కమిటీ సంయుక్త కార్యదర్శి గొల్లకోట నర్సింహమూర్తిగారి అధ్యక్షతను జరిగింది. రాజోలు, అమలాపురం, కొత్తపేట, రాజమండ్రీ, రామచంద్రపురం, కాకినాడ తాలూకాల నుండి 500 మందికి పైగా ప్రతినిధులు హాజరైనారు. బహిరంగ సభకు ముందుగా జరిగిన ప్రతినిధుల మహాసభలో వివిధ లంక ప్రాంతాలలోను మొన్నటి తుపాను వల్ల సంభవించిన కష్ట, నష్టాలను గురించి ప్రతినిధులంతా తమ, తమ నివేదికలను సమర్పించారు. లంకల రైతాంగాన్ని ఎదుర్కొంటున్న వివిధ సమస్యలపైన పెక్కు తీర్మానాలు తయారు చేయబడినవి.

అనంతరం మహాసభ ప్రారంభమైంది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘసభ్యుడు రుద్రరాజు రామలింగరాజుగారు మహాసభను ప్రారంభిస్తూ మొన్నటి తుపాను వల్ల లంకరైతులకు సంభవించిన ఘోరకష్ట నష్టాలను విపులంగా పేర్కొన్నారు. లంకరైతుల పట్ల ప్రభుత్వోద్యోగులు కనబరుస్తున్న ఉదాసీన వైఖరిని నిశితంగా విమర్శిస్తూ రామలింగరాజుగారు ఇలా అన్నారు:

"తుపాను నష్టాలను గురించి ప్రభుత్వోద్యోగులు తయారు జేసిన అంచనాలలో లంకరైతులకు కలిగిన అపార నష్టాల వివరాలు ఎక్కడా కనిపించడంలేదు. వందల కొలది రూపాయల పెట్టుబడితో నాటిన మిరప, అరటి మున్నగుతోటలు తుపాను మూలంగా నేల మట్టమై పోయినవి. పొగనారుమళ్లు ఏతకు సిద్ధంగా ఎదిగి పూర్తిగా ధ్వంసమై పోయినవి. అందువల్ల ఒక్క ఎకరానికి సరిపడు పొగనారు కోసం దాదాపు రెండు వందల రూపాయలవరకు ఖర్చు పెట్టి చీరాల మున్నగు ఇతర ప్రాంతాలనుండి కొని తేవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇలాంటి కష్ట, నష్టాలకులోనై కోలుకోలేని దుస్థితిలో నున్న లంక రైతుల పట్ల ప్రభుత్వం తన విధ్యుక్త ధర్మాన్ని నెరవేర్చి సహాయ పడవలసి వున్నది."

పిమ్మట అధ్యక్షుడు తమ ఉపన్యాసాన్ని ప్రారంభించి తమ కష్ట, నష్టాలను తెలుసుకొని ప్రభుత్వంవారు లంకరైతులకు తగు సహాయం చేయాలంటే మనమంతా సమైక్యతతో ఆందోళన సాగించవలసి ఉన్నదని అన్నారు. తర్వాత దిగువ ముఖ్యతీర్మానాలు ఆమోదింపబడినవి.

తుపానుమూలంగా లంకలలోని పైర్లు అత్యధికనష్టానికి గురి కావడంవల్ల ప్రభుత్వంవారు యీ సంవత్సరం లంకల శిస్తుకు పూర్తిగా రిమిషన్ యిప్పించాలి. తుపాను గాలివల్ల కూలిపోయిన బ్యారక్లకు, రేకులు ఎగిరిపోయిన బ్యారక్లకు రేకులు మున్నగు సామానులను సకాలంలో కంట్రోలు ధరలకు సప్లయి చేయాలి. పెట్టుబడులు కూడా నష్టమై మిక్కిలి దుస్థితిలో నున్న రైతాంగమునకు ఎకరమునకు రూ 200/- తగ్గకుండా దీర్ఘ వాయిదాలపై తీర్చుకునే పద్ధతిని ప్రభుత్వం వారు అప్పలను మంజూరుచేయాలి. ఫిబ్రవరి, మార్చి నెలల్లో చెల్లించవలసిన కిస్తీలను మార్చి, ఏప్రిల్ నెలలకు పొడిగించాలి.

మరి కొన్ని తీర్మానాలుకూడా ఆమోదింపబడిన తర్వాత నూతన సంవత్సరమునకు తూర్పు గోదావరిజిల్లా లంక రైతుల సంఘానికి దిగువ వారిని కార్య నిర్వాహక వర్గంగా ఎన్నుకోవడమైనది.

రుద్రరాజురామలింగరాజు అధ్యక్షుడు, దామిసెట్టి రామారావు, చిట్టూరి వెంకట నరిసింహంగార్లు, ఉపాధ్యక్షులు, గొల్లకోట నర్సింహమూర్తి, కార్యదర్శి. పి. పోశయ్య, సహాయ కార్యదర్శి, నీరుకొండ వెంకటరామారావు, నంబూరి జగ్గరాజు, పెరవలి వెంకటకొండయ్య, మోర్త లక్ష్మణస్వామి, మద్దింశెట్టి వెంకటనర్సింహం, సలాది సత్యనారాయణమూర్తి, సైనాల గణేశ్వరరావు, అల్లంపల్లి వీరాస్వామి, కోనేరాజయ్య, పేరిచర్ల సుబ్బరాజు, బండారు పెదవెర్రెయ్యగార్లు కార్యనిర్వాహక సభ్యులు. మరి 5 గురిని కో ఆప్టుచేసుకొనుటకు కార్యనిర్వాహకవర్గానికి అధికార మివ్వడమైనది.

# కృష్ణాజిల్లాలో సహాయ ధనవ్యయ వివరాలు

## చెరువుల, భవనాల, మరమ్మతులకు రూ 17 లక్షలు

విజయవాడ, డిసెంబరు 6: అధికార అంచనాలనుబట్టి, సాగుచేయబడే 6,32,172 ఎకరాలభూమిలోను ఇటీవలి తుపాను వరద మూలంగా 4,44,702 ఎకరాలభూమి నష్టపడినది. కైకలూరు తాలూకాలో ముంపువల్ల 75 వేల ఎకరాలపంటనష్టమైనది.

ప్రభుత్వం మంజూరుచేసిన 4 లక్షల రూ॥ ల సహాయధనంలో, ఈ క్రింది విధంగా సహాయం నిర్వర్తింపబడింది.

విజయవాడ డివిజన్లోని 223 బాధిత గ్రామాల్లో 205 గ్రామాలకు 54,810 రూ॥ లు ఇవ్వబడింది. నూజివీడు డివిజన్లోని 194 బాధిత గ్రామాలకు 95,000 రూ॥ లు, గుడివాడ డివిజన్లోని 216 బాధిత గ్రామాల్లోను 177 గ్రామాలకు 1,93,480 రూ॥లు పంచిపెట్టబడినవి.

పైసహాయ కార్యక్రమమంతా నవంబరు ఆఖరుకు పూర్తిఅయినది. జిల్లాకలెక్టరు జె. పారేగాగు మరొక 2 లక్షల రూ మంజూరుచేయవలసిందిగ మద్రాసు ప్రభుత్వాన్ని కోరినట్లు తెలుస్తున్నది. ఇప్పటివరకూ సాగు చెర్వులలో చిన్నవాటికి 1,89,100 రూ॥, పెద్దవాటికి 2,46,830 రూ॥, భవనములకు 13,85,144 రూ॥ మరామ్మతుల నిమిత్త ప్రభుత్వం ఖర్చు చేసినట్లు తెలుస్తున్నది. స్వ. వి.

# 'రాష్ట్రవిభజనతోపాటు రాష్ట్రచేనేత సహకార సంఘాన్ని విభజించాలి'

## ఆంధ్రరాష్ట్ర చేనేత కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

ఏలూరు, డిసెంబరు 6: ఆంధ్రరాష్ట్ర చేనేత కాంగ్రెస్ కార్యవర్గసభ మొన్న సాయంత్రం యిచ్చటవార్ని రాజా వీరయ్యగారి భవనములో సంఘాధ్యక్షులు కాశిన బసవరాజుగారి అధ్యక్షతను జరిగింది. చేనేత పరిశ్రమ కేర్పడిన ప్రస్తుత క్లిష్టపరిస్థితులనగూర్చి దీర్ఘంగా చర్చించి, కార్యవర్గమువారు యీ దిగువ తీర్మానములు చేశారు.

చేనేత పారిశ్రామికుల నిరుద్యోగ నిర్మూలనకై మద్రాస్ ప్రభుత్వం ప్రవేశపెట్ట నిశ్చయించిన రిలీఫ్ స్కీమును యింతవరకు ఎచ్చట అమలుపర్చక ఉదాసీనతవహించియున్నందులకు యీ కమిటీ వారు తీవ్ర అసమ్మతిని ప్రకటిస్తూ రిలీఫ్ స్కీమును అమలుపరచుట కంగీకరించిన చేనేత సహకార సంఘాలలో వెంటనే అమలుపరచుటకు ప్రభుత్వం పూనుకోవాలని కోరుచున్నారు

ఆంధ్రదేశములో కుటీరపరిశ్రమల అభివృద్ధికై ప్రత్యేకశ్రద్ధతీసుకొనుటకు వీలుగా ఆంధ్రరాష్ట్రమంత్రివర్గ నియామకం సందర్భములో కుటీరపరిశ్రమలకు ప్రత్యేక మంత్రిని యేర్పాటుచేయుటకు అవసరమైన చర్యలను తీసుకొనవలసినదిగా ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ కమిటీని యీ సంఘమువారు కోరుచున్నారు.

చెన్నరాష్ట్ర చేనేత సహకారసంఘ విభజననుగూర్చి యీ దిగువ తీర్మానము చేయబడింది.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణముతోపాటు చెన్నరాష్ట్ర చేనేత సహకార సంఘమును విభాగించి ఆంధ్రరాష్ట్రముయొక్క హద్దులతో ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘమును నిర్మించవలసిందని మద్రాస్ ప్రభుత్వమును యీ సంఘమువారు కోరుచున్నారు.

చెన్నరాష్ట్ర చేనేత సహకారసంఘము యొక్క ఆస్తి అప్పులు పంపకము విషయములో కార్యవర్గం ప్రత్యేకం కొన్ని సూచనలు చేసినట్లు తెలియుచున్నది.

యీ సమావేశమునకు హాజరైన కార్యవర్గసభ్యులు; డి. కె వర్మ, (కడప) ఇనుమర్తి వీరభద్రరావు, (రాజమండ్రి) రావు జగన్నాథరావు (దక్షిణవిశాఖ) నార్నిగ జానీవయ్య, తాళ్ళ కోటివీరయ్య (పశ్చిమ గోదావరిజిల్లా) తాటి దశరథరామయ్య (కృష్ణా) ప్రగడ కోటయ్య (గుంటూరు) ప్రత్యేక ఆహ్వానముపై పశ్చిమగోదావరి జిల్లా చేనేత కాంగ్రెస్ ప్రముఖులు కొంతమంది హాజరయ్యారు. (స్వ. వి.)

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ చవితి 1949 సం॥డిసెంబరు 9 శుక్రవారం
చవితి రా 10-36 పున ఉ 6-27 వర్జ్యం ప 2-33 ల 4-11 కు.
బ॥ పంచమి డిసెం॥ 10 శనివారం
శ॥ పంచమి రా 10-7 పుష్య ఉ 6-47 వర్జ్యం సా 7-33 ల 9 కు.

**ఆంధ్రపత్రిక**

విరోధి సం॥ మార్గశిర బ॥ చవితి

శుక్రవారం

## విభజనసంఘ ప్రథమ కర్తవ్యము

ఏమైనప్పటికిని ఆంధ్రరాష్ట్ర స్థాపన కార్యకలాపమును 1950 జనవరి 26 లోపున పూర్తి చేయుట అసాధ్యమని తీర్మానించినప్పటికిని మద్రాసుమంత్రివర్గము కేంద్రప్రభుత్వ హోం శాఖాకార్యదర్శి లేఖ మేరకు ఏనమండుగుర్ను సభ్యులతో మొన్న 'విభజనసంఘము'నుఏర్పరచుట, అందు సభ్యులుగ ప్రభుత్వ పరిపాలన అనుభవము గలవారిని నియమించుట కొంత వరకు హర్షింపతగిన విషయము. విభజనసంఘ అధ్యక్షుడు ప్రధాని కుమారస్వామి రాజాగారు విభజన సంఘ నియామక వార్తను వెల్లడించుచు ఏప్రెల్ 1 వ తేదీ లోపున ఆంధ్ర రాష్ట్ర స్థాపన అసాధ్యమని ప్రకటింప, విభజనసంఘ సభ్యులైన శ్రీ కళా వెంకట్రావుగారు, శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు కూడ నూత్న రాజ్యాంగములోని రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను పేర్కొనుట సాధ్యమగునట్లు, ఈ విభజన సంఘము సంకల్పించిన యావత్తు కార్యకలాపమును పూర్తి చేయుట అసాధ్యము గాదని అభిప్రాయపడుచుండిరి. ప్రధాని కుమారస్వామిరాజాగారికి వీరిట్లు అభిప్రాయపడుచుండిరని తెలుపగా విభజన సంఘమునందు మంత్రులు అయిదుగు రుండిరనియు, వారు సాధ్యముగాదని చెప్పినపుడు విభజనసంఘమునందలి ఇతరసభ్యులు ఎట్టి యభిప్రాయము తెలిపినను ప్రయోజనము లేదన్నట్లు చెప్పిరి.

విభజనసంఘము నిన్నటిదినము మొదటి పర్యాయము సమావేశమైనది. విభజన కార్యక్రమమునకు సంబంధించిన మూల సిద్ధాంతములను వీరు చర్చించినట్లు తెలియుచున్నది. భారతప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి లేఖాంశములను పరిశీలించి విభజన వివరములను పరిష్కరించుట సాధ్యమగునా కాదాయను విషయమును ముందుగ ఈసంఘము వారు నిర్ణయింపవలసియుండెను. ఈ సంఘమువారి విషయములను పరిశీలించి ఒక అభిప్రాయమునకు రాగలుగుటకు పూర్వమే సంఘాధ్యక్షుడు అట్టి విభజన జనవరి 26 లోపున పూర్తి గాదని తీర్పు నిచ్చుట భావ్యము గాదు. ప్రభుత్వ కార్యదర్శులు మాత్రము జనవరి 26 లోపుగ ఈ విభజన వివరము లన్నియు పరిష్కారము కావలెనని నిర్ణయమైన ఆ ప్రకారము పనిని ముగించుట సాధ్యమని అభిప్రాయపడుచున్నట్లు తెలియుచున్నది. ఆంధ్రరాష్ట్రమునకు చెన్నపట్టణము తాత్కాలిక రాజధానిగనున్న విభజన కలాపమును ముగించుట సులభమని మేమిదివరలో చేసిన సూచనకు ప్రభుత్వ కార్యదర్శులు ఆమోదమును ప్రకటించినట్లుకూడ తెలియుచున్నది. ఇందువలన 1950 జనవరి 26 లోపున గవర్నరు జనరల్ ఉత్తరువు వెలువడి నూత్న రాజ్యాంగమునందలి రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను పేర్కొనుట విభజన సంఘసభ్యుల కార్యవిధానముపై ఆధారపడియున్నది. జనవరి 26 లోపునే ఉత్తరువు వెలువడవలెనను పట్టుదల విభజన సంఘసభ్యులకు వుండిన విభజనసంఘ కార్యక్రమమంతయు జనవరి 15 వ తేదీ లోపుగ పూర్తికాగలదు.

రాష్ట్రస్థాపన ఉత్తరువు, రాష్ట్రనిర్మాణము ఒక్కటేయనుభావము విభజన సంఘసభ్యులలో కొందరికి వున్నట్లు కన్పించుచున్నది. కనుకనే కొందరు విభజనలో తొందరపాటు కూడదనుచుండిరి. గవర్నరు జనరల్ ఉత్తరువుతో ఆంధ్ర రాష్ట్రము అవతరింపదు. ఆంధ్ర రాష్ట్ర స్వరూప నిర్వచనము మాత్రమే ఇందు జరుగును. రాష్ట్రావతరణ ఎప్పుడు, ఏ రూపమున జరుగునో గవర్నర్ జనరల్ ఉత్తరువు వివరించును. కనుక తక్షణము రాష్ట్రమేర్పడినగాని రాష్ట్రముల షెడ్యూలులో ఆంధ్రను పేర్కొనుటకు వీలులేదనువాదము సహేతుకముగ కన్పించుటలేదు. షెడ్యూలులో చేర్చినంతమాత్రమున నూత్న రాజ్యాంగము అమలు జరుగుటతో బాటు ఆంధ్రరాష్ట్రము కూడ అమలుకు రావలెనను నిర్బంధము లేదు. రిపబ్లిక్ రాజ్యాంగమున ఆంధ్రరాష్ట్రమును పేర్కొని, ఆ రాష్ట్రము ఏ తేదీనుండి అమలుకు రానున్నదోకూడ స్పష్టముగ ప్రకటించిన తదనుగుణముగ ఇపుడు గవర్నరు జనరల్ ఉత్తరువును తయారుచేసి 1935 వ సంవత్సరము భారతప్రభుత్వచట్టప్రకారమే ఆంధ్రరాష్ట్రస్థాపన ఉత్తరువును జారీచేయవచ్చును. సంకల్పమున్న ఏదియు అసాధ్యముగాదు.

విభజన సంఘము ఈ దృష్టితోనే భారతప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి లేఖాంశములను పరిశీలించి నిర్ణయము చేయవలసియుండును. ఆస్తి, అప్పుల విభజన, ఉద్యోగుల 'పంపకము' మున్నగు వివరములను సావధానముగ పరిష్కరించుకొనవచ్చును. అట్టి పరిష్కారమునకు గవర్నరు జనరల్ ఉత్తరువు ప్రతిబంధకము కానేరదు. ఆంధ్ర, తమిళ కాంగ్రెసు సంఘములు తెలిపిన ఆంధ్ర ప్రాంతములతో, చెన్నపట్టణము ఆంధ్ర ప్రభుత్వమునకు తాత్కాలిక కార్యస్థానముగ విభజన సంఘము నిర్ణయించిన ఆస్తి, అప్పులతో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము కావలెను అని విభజన సంఘము తీర్మానించిన, ఆ ప్రకారము గవర్నరు జనరల్ ఉత్తరువు సకాలములో జారీకాగలదు. విభజన సంఘము ఇందుకు అనుకూలమగు నిర్ణయమును చేయునని ఆశించుచున్నాము.

## సమితిలో చైనా సమస్యపై చర్చ

### రష్యా బహిష్కరణ

లేక్‌సక్సెస్, డిసెంబరు 7: ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశంలో చైనా సమస్యపై చర్చ జరిపినప్పుడు తాము పాల్గొనజాలమని రష్యా, మిగతా స్లావ్ రాజ్యాల ప్రతినిధులు తెలియజేశారు. రాజకీయసంఘంలో అనుసరించిన ధోరణినే సర్వసభ్య సమావేశంలోకూడా రష్యా, దాని ఉపగ్రహరాజ్యాలు అనుసరిస్తున్నవన్నమాట.

# కాశ్మీర్ కమిషన్ నివేదిక: సమితికార్యదర్శికి సమర్పణ

## భద్రతామండలిలో చర్చకురాగానే నివేదికాంశాల ప్రకటన

జెనీవా, డిసెంబర్ 7: కాశ్మీర్ మధ్యవర్తి సంఘం తన నివేదికను పూర్తిచేసినదనీ, అది రేపు ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శికి పంపబడుతుందనీ నేడిక్కడ ప్రకటించబడినది.

మధ్యవర్తి సంఘం న్యూయార్క్ చేరుకున్న తరవాత సాధ్యమైనంత వెంటనే భద్రతామండలి నివేదికమీద చర్చ ప్రారంభిస్తుంది. మధ్యవర్తి సంఘం 18 వ తేదీన స్టీమరులో న్యూయార్క్‌కు బయలుదేరుతున్నది.

భద్రతామండలి చర్చకు వచ్చినవెంటనే నివేదిక ప్రకటించబడుతుందని మధ్యవర్తి సంఘ కార్యాలయం తన ప్రకటనలో వెల్లడించింది.

"కాశ్మీర్ మధ్యవర్తి సంఘం డిసెంబర్ 3 వ తేదీన తన మూడవ నివేదికను జెనీవాలో తయారుచేసింది. మధ్యవర్తి సంఘ సభ్యులయిన అర్జెంటీనా, బెల్జియం, కొలంబియా, జెకోస్లవేకియా, అమెరికాల ప్రతినిధులు 18 వ తేదీన 'క్వీన్‌మేరీ' నౌకలో న్యూయార్క్‌కు బయలుదేరతారు. మధ్యవర్తి సంఘంలో సమితి ప్రధాన కార్యదర్శికి ప్రతినిధిగా వ్యవహరిస్తున్న ఎరిక్ కోల్బన్ 10 వ తేదీన విమానంలో న్యూయార్క్‌కు వెడుతున్నాడు. మధ్యవర్తి సంఘానికి న్యాయవిషయిక సలహాదారుగా ఉన్న మిగ్వెల్ నివేదికను తీసుకుని 8 వ తేదీన న్యూయార్క్‌కు వెడుతున్నాడు. అతడు దానిని సమితి ప్రధాన కార్యదర్శి కివ్వగా, కార్యదర్శి దాని ప్రతులని భద్రతామండలి సభ్యులకు అందజేస్తాడు." అని ఆప్రకటన వివరించింది.

(ఐక్యరాజ్య సమితిలో పాకిస్తాన్ విమర్శ వివరాలు 6 వ పేజీలో)

(ఐక్యరాజ్య సమితిలో పాకిస్తాన్ విమర్శ వివరాలు 6 వ పేజీలో)

### నెలాఖరులో ముగించే సూచన

లేక్‌సక్సెస్, డిశంబర్ 7: భద్రతామండలి కాశ్మీర్ మధ్యవర్తి సంఘ నివేదికమీద 17 వ తేదీన చర్చ ప్రారంభిస్తుందనీ, డిసెంబర్ 31 లోగా-అంటే మండలిలో క్రొత్తసభ్యులు ముగ్గురూ ప్రవేశించకముందే—నివేదికపై చర్చ ముగించాలని మండలి అనుకుంటున్నట్లూ తెలుస్తున్నట్లు పి. టి. ఐ ప్రత్యేకవిలేఖరి వ్రాస్తున్నాడు.

నివేదిక 9 వ తేదీన సమితి కార్యాలయానికి అందుతుందనీ, పాకిస్తాన్, ఇండియాల ప్రతినిధులు తమ ప్రభుత్వాలతో సంప్రదించటానికి ప్రత్యేకంగా ఆలస్యం జరక్కుండా సమితికి పంపినప్పుడే ఆ ప్రభుత్వాలకుకూడా నివేదిక ప్రతులు పంపుతారనీ తెలుస్తున్నది. అంటే 17. వ తేదీన మండలి చర్చను ప్రారంభించే లోపుగా తమ ప్రతినిధులతో చర్చించుకొనటానికి ఆప్రభుత్వాలకు వారంగోజులు వ్యవధి ఉంటుందన్నమాట.

నివేదికపై భద్రతామండలి చర్చించేటప్పుడు సమక్షంలో ఉండటానికే కావచ్చును, భారత విదేశాంగ శాఖా కార్యదర్శి బాజ్పాయ్ ఈవారం చివరలో లేక్ సక్సెస్‌కు వస్తున్నాడు.

మధ్యవర్తిసంఘం తన సామరస్యప్రయత్నాలకు ఏవిధంగా ప్రతిష్టంభనయేర్పడినదీ మండలికి నివేదించి, కొన్ని సూచనలను చేయగలదని తెలుస్తున్నది. ఆ సూచనలేమిటో ఎవరికీ తెలియదు కాని బహుశా మధ్యవర్తిత్వం నెరపటానికి ప్రస్తుతం ఉన్న సంఘానికి బదులుగా ఒకేవ్యక్తి నెవరినైనా నియమించమని సూచించవచ్చునని మాత్రం ఊహాగానం చేయబడుతున్నది.

మధ్యవర్తిత్వానికే తప్ప పరిష్కర్త నియామకాన్ని తాను అంగీకరించేది లేదని ఇండియా లోగడ స్పష్టంచేసి ఉన్నది.

భద్రతామండలి ఈ నెలాఖరులోగా చర్చను ముగించాలని అనుకొనటానికి ముఖ్య కారణం జనవరి 1 వ తారీఖున మండలి క్రొత్త సభ్యులు ఇండియా, ఈక్వెడార్, యుగోస్లావియాలు సభ్యత్వం స్వీకరించటమేమో ననిపిస్తున్నది. ఇందులో ఈక్వెడార్, యుగోస్లావియాలకు కాశ్మీర్ సమస్య క్రొత్త కనుక చర్చను మళ్లీ మొదలుపెట్టమని అడగవచ్చును.

మొత్తానికి ఈ నెలాఖరులోగా భద్రతామండలి కాశ్మీర్ విషయమై ఒక నిర్ణయం చేయవచ్చును.

### మండలిలో వాదనకు భారత ప్రతినిధివర్గం

న్యూఢిల్లీ, డిసెంబరు 7: భద్రతామండలిలో, కాశ్మీర్ కమిషన్ నివేదిక ఈ నెల తుదివారంలో విచారణకు వస్తుంది. బి. యన్. రావుగారు ఇండియా తరఫున వాదించుతారు. వీరికి భారత దేశంనుంచి వెడుతున్న ప్రత్యేక ప్రతినిధివర్గం సాయపడుతారు. ఈ ప్రతినిధివర్గంలో, భారత విదేశాంగశాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయ్, కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా, కాశ్మీర్ ఉపప్రధాని డి. పి. ధార్ గార్లు వెడుతున్నారు.

బాజ్‌పాయ్, ధార్లు రేపు ఢిల్లీలో బయలుదేరుతారు. ప్రధాని అబ్దుల్లా కొన్ని తొందరపనులు చూసుకోవలసిన కారణంగా అనంతరం బయలుదేరి న్యూయార్కులో ఈ ప్రతినిధివర్గాన్ని కలుసుకుంటారు.

### ఆజాద్ కాశ్మీర్ నాయకుని రాక

న్యూయార్క్, డిశంబరు 7: కాశ్మీర్ సమస్యపై భద్రతామండలి డిసెంబరు 17-వ తేదీన జరిపే చర్చలో పాల్గొనడానికి 'ఆజాద్ కాశ్మీర్' ప్రభుత్వాధ్యక్షుడు సర్దార్ ఇబ్రహీంఖాన్ నేడు ఇక్కడికి చేరాడు.

"కమిషన్ నివేదిక తప్పక మాకే అనుకూలంగా వుంటుంది. మా పక్షానికి సంబంధించినంతవరకూ ఎట్టి వాదనకూ అవసరమే వుండదు." అనికూడా ఇతడు అభిప్రాయపడుతున్నాడు.

## రంగాగారి సూచన

(1-వ పేజి తరువాయి)

రించుకోవచ్చు,'' అని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు ఆచార్య రంగా, రాష్ట్రప్రభుత్వానికి సూచిస్తూ నేడు ఒక ప్రకటన చేశారు.

1950 జనవరి 26 లోగా ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించే విధానం పేర్కొంటూ రంగా తమ ప్రకటనలో యిలా తెలియజేశారు.

"ఒకే గవర్నర్ ఆధిపత్యం క్రింద, రెండు మంత్రివర్గాలను, రెండు శాసనసభలను యేర్పాటుచేయవచ్చు. మద్రాసు ఆంధ్రరాష్ట్రములకు ఉమ్మడిగా ఒక సెక్రటేరియట్ ఉమ్మడిగా ప్రభుత్వ శాఖాధిపతులు హైకోర్టు, పబ్లిక్ సర్వీసు కమీషన్ యేర్పాటుచేసుకోవచ్చు. ఈ యేర్పాటు 1950 ఏప్రెల్‌వరకూ అమలులో ఉండవచ్చు.

1950 ఏప్రిల్‌వరకూ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం సాధ్యంగాదంటూ మద్రాసు మంత్రివర్గం చేసిన నిర్ణయంపై వ్యాఖ్యానంచేస్తూ, రాష్ట్రంయేర్పడకుండా,కనీసం ఒక సంవత్సరం వరకైనా వాయిదా వేయడానికి, యింతకంటే నిరాఘాటమైన మార్గంలేదు "

ఇలా వాయిదా పడడం జరిగితే క్రొత్త రాజ్యాంగచట్టం ప్రకారమే ఆంధ్ర రాష్ట్రం యేర్పడాల్సి ఉంటుంది. క్రొత్త రాజ్యాంగ ప్రకారం రాష్ట్రం యేర్పడాలంటే చాలా ఆలస్యకరమైన విధానం అవలంబించాల్సి ఉన్నది. ఆంధ్రరాష్ట్రాన్ని యేర్పాటుచేసే తీర్మానం ఆమోదించవలసిందిగా భారత రిపబ్లిక్ అధ్యక్షుడు భారతప్రభుత్వాన్ని కోరవలసి ఉంటుంది. అనంతరం భారతప్రభుత్వం రాష్ట్ర నిర్మాణానికి ప్రత్యేకంగా ఒకబిల్లు తయారుచేసి, పార్లమెంటు ఆమోదాన్ని పొందవలసి ఉంటుంది" అని రంగా అన్నారు.

## ఆంధ్రతమిళనాయకులతో శ్రీ వెంకట్రావు సంప్రదింపులు

చెన్నపట్నం, డిసెంబరు 7: తమిళ కాంగ్రెసు సంఘ అధ్యక్షులు శ్రీ కామరాజనాడారు, టి. టి. కృష్ణమాచారి గారలు అ. భా. కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావుగారితో నిన్న రాత్రి 1 గం. సేపు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము, విభజన నియామక సందర్భమున సంప్రదింపులు జరిపిరి.

శ్రీ వెంకట్రావుగారు నిన్నను, నేటి ఉదయం ఈ సందర్భమునసే శ్రీ ప్రకాశం పంతులుగారిని సందర్శించి సంప్రదింపులు జరిపిరి. ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు నేటి ఉదయం శ్రీ వెంకట్రావు గారితో కొంతసేపు సంప్రదింపులు జరిపి వెళ్లిరి.

## నెహ్రూ ఉద్బోధ

(1 వ పేజీ తరువాయి)

సాధించాం, అనిమాత్రం అనవలుంటాం.

పరిస్థితులు మారిపోతూవుంటే, వాటి కనుగుణంగా మనం దిద్దుబాటు కావడం అనేది తేలికయైనపని కాదు. ఒకవేళ శారీరకంగా అట్లా చేయగల్గినా మనస్సు వెనకపడే వుంటుంది. అందులోనూ ఒక రకమైనజీవితానికి, ఒక రకమైన కార్యక్రమ విధానానికి అలవాటు పడిపోయిన మీరు, ఈ క్రొత్త పరిస్థితులకు అనుకూలంగా దిద్దుబాటు కావడం ఎంత కష్టమో, అట్లాగే ఇతరులకు స్వాతంత్ర్యం రావడంవల్ల ఏర్పడిన బాధ్యతలను నిర్వహించగల క్రమశిక్షణను అలవరచుకోవడంగూడా కష్టమే అవుతుంది. అందువల్ల ఇదంతా సవ్యంగా నెరవేరడానికి కొంత కాలం పడుతుంది. అయినా మీరు ఈ మార్గంలో చాలా ముందుకుపోయారు.

ఏదేశంలో ప్రభుత్వయంత్రాన్ని నడపాలన్నా అన్ని శాఖల్లోను ఉద్యోగస్థులు సమర్థులైనవాళ్ళు,విశ్వాసపాత్రులైనవాళ్లు వుంటేనేగాని సాధ్యంకాదు. ఇది అందరికీ తెలిసిన విషయమే. వారి సహాయం లేనిదే ప్రభుత్వం కొనసాగదు. అందువల్ల మన ఉద్యోగస్థులుగూడా సమర్థులు, విశ్వాసపాత్రులూ అయివుండాలి. అంతే కాక, క్రొత్తగా అవతరించిన ప్రజాస్వామ్య భావాలను పుక్కిలి పట్టగల్గినవాళ్లుగూడా అయివుండాలి. పరిస్థితులు మారాయి గాబట్టి, వాటికి అనుగుణంగా నడుచుకో గలవాళ్లుగూడా అయివుండాలి.

ఇందులో మనం విజయాన్ని సాధించామనే చెప్పాలి. కాని దీనిఫలితార్థం మనం సాధించే విషయాలమీద ఆధారపడివుంటుంది. ఆ విషయాలయొక్క ఫలితాన్ని మనం ఎట్లా గణించవలసి వుంటుంది? ప్రజలు పూర్వంకన్నా బాగుపడి, సంతృప్తిగా వున్నారా? లేదా? అనేదానిమీద అది ఆధారపడివుంటుంది. వారు మనపట్ల చూపే ఆదరాభిమానాలమీద అది ఆధారపడివుంటుంది. కాని పరిస్థితి విషమంగా వున్నప్పుడు, అటువంటి ఆదరాభిమానాలు ఏర్పడటం కష్టం అని గూడా మన అంగీకరించాలి. అయినా ఒక మహోద్యమ సాధనలో విశ్వాసపాత్రంగానూ, చాకచక్యంతోనూ పనిచేస్తే, ఫలితం లేకుండా ఎప్పుడూ పోదు. కాని దాన్ని ప్రజలు గుర్తించడానికి కొంతకాలం పట్టవచ్చు.

మీరు దేశాన్ని అనేకవిధాలు సేవిస్తున్నారు. అనేక హోదాల్లో ఆరాధిస్తున్నారు. కొందరు పెద్దస్థానాల్లో వుంటారు. కొందరు ఇతరమైన హోదాల్లో పనిచేస్తారు. కొందరు సేనాధిపతులై వుంటారు. మరి కొంతమంది సైనికులై వుంటారు. ఇందులో ముఖ్యంగా అవసరమైన దేమిటంటే క్రమశిక్షణ. మనలో కొంతమంది పెద్దఉద్యోగులు వుండవచ్చు, కొంతమంది చిన్న ఉద్యోగస్థులు వుండవచ్చు, అయినా మనమంతా స్నేహితులమని, ఒక కార్యాన్ని సాధించడంలో నిమగ్నమై వున్నామని తెలుసుకుంటే ఏ బెడదా లేకుండా పోతుంది.

మనం వుంటున్న సంఘంలోనే ఎన్నో హెచ్చుతగ్గులు వున్నాయి. కొందరు గొప్పవారు వున్నారు. కొందరు అల్పులు వున్నారు. కొందరు ధనవంతులు వున్నారు. కొందరు దరిద్రులు వున్నారు. మనం ఈ సంఘంలో ఇట్లా ఏర్పడివున్న ఈ అంతరాన్ని తొలగించడానికి, అందరికి సమానావకాశాన్ని కల్పించే నిమిత్తమున్నా పని చేస్తున్నాము. మనం చేసే ప్రతి పనిలోను, వ్యక్తికి ఒక గౌరవం వున్నదని, అతడు చేసేపనికి ఒక విలువ వున్నదని గుర్తించి మరీ వ్యవహరిస్తున్నాము. ఎవరు సంఘక్షేమంకోసం పనిచేయరో, ఎవరు ఇతరుల కాయకష్టఫలితంగా తమకు దక్కినదానిని అనుభవిస్తానుకుంటారో, వారు దేశానికి, సంఘానికిగూడా బరువుగానే వుంటారు. అట్టివారిని ప్రోత్సహించడం ఎప్పుడూ పనికిరాదు.

మనదేశం బీదదేశం. కాని పుష్కలమైన సహజసంపద వుంది. ఇప్పుడు మనం దానిని పండించి దేశంనుండి,దారిద్ర్యాన్ని నిరుద్యోగాన్ని పారద్రోలవలసి వుంది. మనం దేశంలో ఉద్యోగాలు వున్నాయంటే, వాటిని ఒక ధనవంతమైన దేశంలో ఏర్పాటుచేసినట్లు ఏర్పాటుచేశాము. అందులో ముఖ్యంగా పెద్దఉద్యోగాలు పూర్తిగా ఈవిధంగా వున్నాయి. అందువల్ల సామాన్య ప్రజానీకానికి వారికిమధ్య ఎక్కడలేని అంతరం ఏర్పడింది. మనం ఆ అంతరాన్ని నాశనం చెయ్యాలి. మన దేశానికి అనుకూలంగా వుండేవిధంగా వాటిని సర్దుకురావాలి. దేశంలో పని చేస్తున్న రక్షణశాఖోద్యోగులకు, సివిల్ ఉద్యోగులకు అనువైన పరిస్థితులు కల్పించి, ఉద్యోగ విషయంలో ఎటువంటి ఉపద్రవమూ వారికి లేకుండాచూడాలి. ఒక కూలివాడిని పెట్టుకుంటే వాడికి సరిగ్గా కూలివ్వకపోతేగాని పనిచేయడు. అట్లాగే ఉద్యోగస్థుల విషయంలోగూడా. కాని ఉద్యోగులు సంతృప్తిగా వుండాలన్నా, సమర్థతంగా వుండాలన్నా ప్రజల ఆదరాభిమానాలు ముఖ్యంగా అవసరం. వారి కోలువులో మనం వున్నాం. మన అదృష్టాన్ని గాని, దురదృష్టాన్ని గాని నిర్ణయించేది వాళ్లే.

దేశం ఇప్పుడు ఆర్థికసంక్షోభంలో పడిపోయింది. దీన్నుంచి బయటపడటానికి మనం అంతా నడుంకట్టుకు ముందుకు రావాలి. ఎవరి శక్తికొద్దీ వారు పాటుపడాలి. ప్రభుత్వోద్యోగులంతా ఈ విషయాన్ని గుర్తించారు. అందువల్ల వాళ్లే ముందుకువచ్చి ఈ కార్యభార నిర్వహణాన్ని నెత్తిమీద వేసుకుంటున్నారు. వారి జీతాలు తగ్గించబడినాయి. అంతులోంచిగూడా విధిగా అదాచెయ్యాలని ఒకనియమం ఏర్పాటయింది. ఇందువల్ల వారిలో కొంతమంది పనిపిట్టంకట్టింది. ముఖ్యంగా చిన్నఉద్యోగస్థుల విషయంలో ఇది బాగా ప్రవర్తిల్లింది. అయినా వారు దేశప్రజలు, ఇకా ఇతరులైన చిన్నఉద్యోగులు వహిస్తున్న భారాన్ని చూచి సహించాలి. ఇవ్వాళ్ల ఈ కష్టాన్ని సహించగలిగామా, రేపు అందరు భోగభాగ్యాలతో విలసిల్లడం చూడగల్గుతాం.

పూర్వం ఒకప్పుడు నేను బెర్నార్డ్ షా వ్రాసిన కొన్నివాక్యాలు చదివాను. అవి నన్ను బాగా కదిలించాయి. ఆయన అన్నమాటలు ఇవి. "నీవు అసాధ్యమైనది అనుకుంటున్న పనిని చేతబట్టి, ఈ లోకం మనమాటవినదు; మనకు సుఖాన్ని చేకూర్చదు అని విసుక్కోకుండా జీవితాంతం దాన్ని సాధించడానికి పూనుకొన్ననాడు జీవితం ధన్యమౌతుంది" అని ఆయన వ్రాశాడు.

నిజానికి మనం అంతటి ఎత్తులకు ఎగరలేకపోయినా, ఒక మహానాయకుడు, ఒక మహాప్రతిభావంతుడు,ఒక అతీంద్రియ శక్తి సంపన్నుడు, నాయకుడై దేశాన్ని దేశచరిత్రను మూసలో పోసినట్లు పోతపోయగల్గినప్పుడు మనం మన శక్తితో ప్రమేయం లేకుండానే ఆ ఎత్తులకు అందుకోగల్గుతాం.

మహాత్మాగాంధీ ఈ దేశం యొక్క నాయకత్వాన్ని చేతబట్టడంతో అటువంటి మహాకార్యం ఇచ్చట సాధింపబడింది. తన వ్యక్తిత్వం చేత,సందేశంచేత దేశాన్ని సమ్మోహపరచి ఆయన దాన్ని ఆ ఎత్తునకు తీసుకుపోయారు.

ఇప్పుడు ఆయన మనకు లేకుండా పోయారు. కాని ఆయన ఇచ్చిన సందేశం మనలో బాగా ఇవాతిలించివుంది. ఆయన లోని చిచ్చక్తిలో మసలుతూనే వుంది. ఆయన సాధ్దామనుకున్న కార్యంలో సగం మాత్రమే పూర్తి అయింది. తక్కిన దాన్ని పూర్తిచేయవలసిన బాధ్యత మన మీద వుంది. అందుకు మనం నిర్విరామంగా పనిచెయ్యాలి ఆందులో మనమంతా స్నేహితుల్లాగా, సైనికుల్లాగా చేతులు చేతులు కలిపి ముందుకు నడవాలి

# "విజయవాడపై అదనపు రుసుముభారంరద్దుకావాలి"

## పబ్లిక్ వర్క్స్ మంత్రికి పురపాలక సంఘరాయబారుల విజ్ఞప్తి

విజయవాడ, డిశంబరు 7: "యుద్ధకాలమునుండియు, విజయవాడకు విద్యుచ్ఛక్తి ఉత్పత్తికొరకు ప్రభుత్వము స్థాపన చేయుచున్న బొగ్గుపై, అదనపు రుసుము వసూలు చేయబడుచున్నది. ఈ అదనపు రుసుము [సర్‌చార్జి] క్రింద ప్రస్తుత మ్యునిసిపల్ కౌన్సిల్ ఎన్నుకొనబడినవాటి నుండి రూ 201928 ప్రభుత్వమునకు చెల్లించినది. మామూలుగా సంవత్సరమునకు దాదాపు రూ 50 వేల లాభము రావలసిన విద్యుచ్ఛక్తి సప్లైపై, లాభము రాకపోగా మ్యునిసిపాలిటీకి ఈ అదనపు రుసుమువలన చాల నష్టము సంభవించుచున్నది. ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రస్తుత మ్యునిసిపల్ కౌన్సిల్‌వారు ఈ నష్టమును పూడ్చుటకై ప్రజలపై అదనపు రుసుమును వసూలుచేయ బూనుకొనజాలరు"అని మొన్న సాయంత్రం, మదరాస్ పి. డబ్ల్యు. డి. మంత్రి భక్తవత్సలంగారితో, విజయవాడ మ్యునిసిపల్ చైర్మన్ డా॥ టి. వి. యస్. చలపతిరావు నాయకత్వముక్రింద నియమింపబడిన పురపాలక రాయబార వర్గమువారు, విన్నవించిరి.

ప్రజలపై ఈ అదనపు రుసుమును వసూలుచేయుటకంటె, ప్రజా ప్రతినిధులమైన తామెల్లరూ తమ సభ్యత్వములకు రాజీనామా నిచ్చుటయే సమంజసమని రాయబారమువారు తెల్పిరి. విద్యుచ్ఛక్తిని భారీగా సప్లయి చేయలేకపోగా, అదనపు చార్జీలనుకూడా విధించుట బాగుండదు—ఇప్పటికే రుపాయలవల రూ 5 లక్షలకు పైగా మ్యునిసిపాలిటీ నష్టపడినది. కావున ఇంతవరకుఅయిన సర్‌చార్జి మొత్తమును ప్రభుత్వమువారు రద్దుచేయవలె ననియు, ముందు ఇట్టి రుసుమును వసూలుచేయకుండా ఉండవలె ననియు, పురపాలక సంఘ రాయబారులు మంత్రిగారినికోరిరి.

ఈ విషయమై ఆలోచింతుమని మంత్రిగారు సమాధానమిచ్చిరి. (స్వ. వి.)

## విభజనసంఘ సమావేశం

1 వ పేజీ తరువాయి

ననుసరించి రాష్ట్రమును విభజించుటకు ప్రాథమిక వాంశములు పరిసమాప్తిచేయుట సాధ్యమా అని అడిగిఉండిరి. విభజన స్థూలముగా జరిగిన చాలదనియు, పూర్ణమైన విభజన జరుగుట అవసరమనిగూడా వారు సూచించిరి. దానికి మద్రాసు ప్రభుత్వంవారు ఆస్తి అప్పులు, సిబ్బంది మున్నగు సమస్యలన్నీ జనవరి 26 లోపల పరిష్కారమగుట అసాధ్యమని తెలిపి ఉన్నారు: కేంద్రప్రభుత్వంవారు తాము వ్రాసిన పూర్వాభిప్రాయమును మార్చుకున్నగాని జనవరి 26 వ తేదీ లోపల రాష్ట్రము షెడ్యూలులో చేర్చుట సాధ్యముగాదని విభజనసంఘ సభ్యులొకరు ఆంధ్రపత్రిక ప్రతినిధితో తెలిపిరి. మద్రాసు ప్రధాని నిన్న పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచూ తాము వ్రాసిన లేఖపై ఎట్టి సమాధానము వచ్చునని తాము తలచుటలేదని తెలిపిరి. మరి ఒక విభజన సంఘసభ్యుడు మాట్లాడుచూ జనవరి 26 లోపల పని ముగించుట అసాధ్యమనియు ఏప్రిల్ 1 వ తేదీకి పూర్తి చేయవచ్చుననియు మార్చిలోపల పూర్తిచేయవచ్చుననియు తెలిపిరి.

## వెంకట్రావుగారి అభిప్రాయం

చెన్నపట్నం, డిసెంబరు 7: విభజన సంఘంవారు తలంచుకున్నట్లయితే జనవరి 26 లోపల రాష్ట్రంరావచ్చు. ఇప్పుడు ఉన్న నిర్వివాద ప్రాంతాలతో (రెవెన్యూ జిల్లాలు) రాష్ట్రాన్ని ఏర్పరచవచ్చు.ఆస్తి అప్పులు సావధానంగా విభజించుకొనవచ్చు. ఆంధ్రరాష్ట్ర పరిపాలన నడవటానికి కొంతద్రవ్యాన్ని ఇచ్చి రాష్ట్రాన్ని ఆరంభింపవచ్చు," అని అ. భా. కార్యదర్శి కళా వెంకట్రావుగారు నేడుపత్రికా ప్రతినిధులతో మాట్లాడుచు తెలిపిరి.

శ్రీ వెంకట్రావుగారు ఇటుల తెలిపిరి: "మద్రాసురాష్ట్ర రాజధానీ నగరహక్కుకు ప్రతిబంధకంలేని పక్షమున ఆంధ్ర రాష్ట్ర రాజధాని మద్రాసులో తాత్కాలికంగా ఉండటానికి తమిళులకు ఆక్షేపణ ఉండే నవసరంలేదు. మద్రాసుపై ఆంధ్రులు తమ హక్కును వదలుకున్నారు. ఇక బళ్లారి సరిహద్దు మూడు తాలూకాలు 1921 నుంచీ ఆంధ్రప్రాంత కాంగ్రెసులో ఉన్నవి. మిగతా ఆరు తాలూకాలవారు ఆంధ్రరాష్ట్రములో చేరుతామన్న చక్కగా చేర్చుకుంటాము. లేదు. బొంబై రాష్ట్రములో చేరుతామంటే మాకాక్షేపణలేదు. కాని రెవిన్యూ శాసనములు మున్నగు ప్రతిబంధకములు ఉన్నవి. ఇక మద్రాసు పరిసర ప్రాంతముల పరిహద్దుల సమస్య. చెంగల్పట్టులో కొన్ని తెలుగు గ్రామాలు ఉన్నవి. చిత్తూరులో కొన్ని తమిళ గ్రామాలు ఉన్నవి. ఇవి మార్చుకొనవచ్చును. స్థూలముగా విభజన చేసుకొని వివరాలు తర్వాత పరిష్కారం చేసుకొనవచ్చు. ఆంధ్ర తమిళ నాయకులు పరస్పర సౌమనస్యంతో కూర్చుంటే వీటని పరిష్కరించుకొనవచ్చు. జనవరి 26 లోపల రాష్ట్రం వచ్చేటట్లు చేసుకొనవచ్చు. లేనిచో శాసనసభద్వారా కావలసినదే. పరిహద్దుల సమస్య ఇప్పుడు ఒప్పందం ప్రకారం పరిష్కారమైతే సరిహద్దుసంఘంవారి కార్యం సులభమై పోతుంది.

మద్రాసు భవిష్యత్తునుగూర్చి ఒకరు అడిగిన ప్రశ్నకు సమాధానంగా భవిష్యత్తు ఎవరు చెప్పగలరనీ, తమిళులే కొందరు మద్రాసును కేంద్రపాలిత ప్రాంతముగా చేయవలెనని కోరవచ్చుననియు తెలిపిరి.

## సినిమాలకు సాపులచట్టము

మదరాసు, డిసెంబరు 7: సెన్సార్, ప్రేడుకోలకు సంబంధించినంతవరకు సినిమాలను సాపులచట్టపు శక్షన్ 13 (1)నుండి మినహాయించుచు ప్రభుత్వము పుత్తర్వు చేసెను.

# ఏజన్సీ ప్రాంతాల అభివృద్ధి

## ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారి సూచనలు

మదరాసు, డిశంబరు 8: విశాఖపట్నం తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలోని ఏజన్సీ ప్రాంతములు కొండజాతుల అభివృద్ధి గురించి నేడు కవున్సిల్ భవనములో జరిగిన సమావేశములో చర్చించిరి.

సమావేశమునకు ప్రధాని శ్రీ కుమారస్వామిరాజా అధ్యక్షత వహించిరి. ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డి, వ్యవసాయ మంత్రి ఎ. బి. షెట్టి, గ్రామోద్ధరణ మంత్రి పరమేశ్వరన్ హాజరైరి.

ఈ ఏజన్సీ ప్రాంతముల అభివృద్ధికి పదివర్ష ప్రణాళిక నొకటిని తయారు చేయవలెనని సమావేశముయొక్క అభిప్రాయమై యున్నది. ఈ ప్రణాళిక అమలుకు ప్రత్యేకముగా ఒక డెవలప్‌మెంటు కమిషనరును నియమించవలెననికూడా స్థూలంగా అంగీకరించిరి.

సమావేశ ఉద్దేశ్యము వివరించుచూ ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు ఇట్లు ప్రసంగించిరి. మన ఏజెన్సీ ప్రాంతము హైదరాబాదు మధ్యపరగణాల నానుకొని పశ్చిమ గోదావరిజిల్లా చింతలపూడి తాలూకా ఉత్తర సరిహద్దునుండి ఒరిస్సా సరిహద్దు వరకు వ్యాపించియున్నది. ఆ ప్రాంతములో వెనుకబడిన కొండజాతులు ఉన్నారనే గాక రాష్ట్రమునకే గాక మొత్తం దేశమునకు ఉపకరించు సహజ సంపద ఉన్నందున ఈ ప్రాంతము అభివృద్ధికి ప్రభుత్వము శ్రద్ధవహించవలసి యున్నది. వ్యవసాయము, పళ్ల పెంపకము, అడవులు, ఖనిజములు గల ఇంత విస్తీర్ణము రాష్ట్రములో మరెచటనూ లేదు. వ్యవసాయమునకు పనికివచ్చు వర్షము నదీప్రవాహములున్నవి. మచ్ఖుండ్ కేవలు హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులేగాక ప్రవీణులు పరిశీలించిన ఈ ప్రాంతములో ఇంకనూ ఇటువంటి అవకాశములు వెలువడవచ్చును.

ఇవన్నీ తెలిసికూడ ఏజెన్సీ అభివృద్ధికిగాని, కొండజాతుల అభివృద్ధికిగాని క్రమమైనపని ఏమీజరగలేదు. కొండజాతుల ఉద్ధరణకు ప్రభుత్వము కొంత ధనము వెచ్చించెను. ఈ విషయములో కూడ తాత్కాలిక ప్రతిపాదనలు చేయుట అంగీకరించుట మాత్రము జరిగెను. ప్రతిపాదనలు సావధానముగానే వున్నవి కాని దీనిని సమన్వయ మొనర్చి పని చేయుట జరుగలేదు. ఈ ప్రాంతము అభివృద్ధికి క్రమమైన కలప విధానము అనువుగా వుండునని అంగీకరించెదరు. ఈ ముఖ్యముగా ఆరుకులోయ పథకము తప్ప ఇతరమేమీ జరుగలేదు.

అధికారము చేతికి వచ్చిన తరువాత ఇటువంటి సమస్యలను మన భావములకనుగుణ్యముగా పరిష్కరించు కొనుసావకాశము ఏర్పడెను. ఒక ప్రణాళిక లేకపోవుటవల్లనను, కొండజాతులను, మైదాన ప్రజలనుండి కేటాయించు విధానము వల్లనను బ్రిటిష్ పరిపాలనలో అభివృద్ధి మందముగా జరిగెను. 1917 మదరాసు యాక్టు I క్రింద కొండజాతులను డబ్బుపెట్టుబడిదార్ల దోపిడీ అరికట్టలేకపోయినారు. ఆ యాక్టులోని లోట్లను తొలగించు విషయమును కూడ మీరు పరిశీలించవలెను. కొండజాతులను శాసనములతో ఉద్ధరించలేము. వారి ఆర్థిక స్థితిని జీవన పద్ధతులను మార్చి విద్యాప్రబోధము చేయవలసి యున్నది.

ఈ సమావేశమున చర్చించవలసిన విషయములు మాకు తెలిసియే యున్నవి. సిద్ధముగా వున్న అభివృద్ధి ప్రణాళికల భోగట్టా ఇవ్వబడెను. ఈ సమావేశానంతరం ప్రణాళికలను తయారు చేయుటకు ప్రవీణుల సంఘము నియమించవలసి యున్నది నూతన రాజ్యాంగము క్రింద ఏజన్సీ ప్రాంతముల అభివృద్ధికి ప్రత్యేకముగా శ్రద్ధ తీసుకొనవలసియుండును. కొండజాతుల సలహా సంఘ మొకటి 20 మంది శాసన సభ్యులు, కొండజాతుల ప్రతినిధులతో నియమించెదరు.

రాజ్యాంగము అమలు జరిగిన దరిమిలా పది సంవత్సరములలో కొండజాతులను నాగరిక ప్రజలతో సమానము చేయవలెనని ఉద్దేశ్యము అయి యున్నది. ఈ ఉద్దేశ్య నిర్వహణకు మనం ఇప్పటి నుండి కృషి చేయ వలసియున్నదనిరి.

# బిన్నీ కంపెనీ వారి 10వేల రూ॥ విరాళం

మద్రాసు, డిసెంబరు 8: మద్రాసులోని బిన్నీ కంపెనీ వారు, వారితో కలిసి ఉన్న మరికొన్ని కంపెనీలవారు ఆంధ్ర తుపాను బాధితుల సహాయానికై మద్రాసు వెల్ఫేర్ నిధికి 10వేల రూ॥ల విరాళం పంపించారు.

# తుపాను నిధికి నాటకం

మదరాసు సెక్రెటేరియటు ఆంధ్ర సంఘంవారు సెలూనులో యీ నెల 10, 11 తేదీలందు ఆంధ్రతుపాను నిధి సహాయార్థం తెలుగులో చంద్రగుప్త నాటకమును ప్రదర్శించెదరు.

# బొంబై కర్నాటక మంత్రి రాజీనామా

## పార్లమెంటరీ కార్యదర్శుల అనుసరణ

బొంబాయి, డిసెంబర్ 7: బొంబాయి మంత్రివర్గంలో ఏకైక కర్ణాటకసభ్యుడూ, రాష్ట్రవ్యవసాయ, అటవీశాఖల మంత్రి అయిన ఎం. పి. పాటిల్‌గారు తన శాసనసభ్యత్వాన్ని వదులుకుంటూ కాంగ్రెసు పార్లమెంటరీబోర్డుకు రాజీనామాను దాఖలు చేయబోతున్నానని నేడు ప్రకటించారు. కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు రాజీనామాను ఆమోదించగానే మంత్రిపదవికి రాజీనామాను బొంబాయి ప్రధానికి పంపుతానని ఆయన వెల్లడించాడు.

తనతోపాటుగా కర్నాటకం నుండి వచ్చిన నలుగురు పార్లమెంటరీ కార్యదర్శులూ రాజీనామా నిస్తారని ఆయన తెలియజేశాడు.

కాంగ్రెస్ కార్యవర్గం కర్నాటక రాష్ట్రాన్ని స్థాపించనందుకు నిరసిస్తూ కర్నాటక సభ్యులంతా కేంద్రంలోనూ, రాష్ట్రాల్లోనూ శాసనసభ్యత్వాలకు రాజీనామా లివ్వాలని కర్నాటకరాష్ట్ర కాంగ్రెస్ ఇచ్చిన ఆదేశాన్ని అనుసరిస్తూ వీరీ నిర్ణయం చేసుకున్నారు.

ఈ ప్రకటన చేసే ముందు పాటిల్‌గారు ప్రధాని ఖేర్‌తోనూ, మంత్రివర్గంతోనూ ఈ విషయమై చర్చించారు. కర్నాటక కాంగ్రెసు తీర్మానాన్ని ఎట్లా అనుసరించాలి అన్న విషయమై చర్చలు జరిగవి.

ప్రధాని ఖేర్ విలేఖరులతో ప్రసంగిస్తూ, పార్లమెంటరీబోర్డు రాజీనామాలను ఆమోదించిన తరవాత తప్పు ప్రసక్తి వస్తుందని అన్నాడు. కర్నాటక కాంగ్రెసు తన సభ్యులందరినీ, పార్లమెంటరీ బోర్డు అనుమతి తీసుకుని శాసన సభ్యత్వాలకు రాజీనామా నివ్వమని నిర్దేశించింది.

## బొంబై శాసన సభ్యుల రాజీనామా

కర్నాటక ప్రాంత నుంచి బొంబాయి శాసనసభకు ఎన్నుకోబడిన మరి 8 మంది సభ్యులు నేడు కర్నాటక కాంగ్రెస్ అధ్యక్షునకు శాసన సభ్యత్వాలకు రాజీనామా లిస్తూ తెలియజేశారు. వీరితో ఇప్పటికి 24 గురు కర్నాటకశాసనసభ్యులు బొంబాయిలో రాజీనామా చేసినవారయినారు.

బొంబై శాసన సభలో మొత్తం 28 మంది కర్నాటక సభ్యులు—ఎసెంబ్లీలో 26 గురు, కౌన్సిల్‌లో ఇద్దరు—ఉన్నారు.

## "బెదిరింపు కాదు"

"కర్ణాటక మంత్రులు, శాసనసభ్యులు రాజీనామాల నివ్వటమన్నది కేవలం బెదిరింపుకై వేసిన ఎత్తులు కావు. మొదటి నుంచీ కర్ణాటకరాష్ట్ర నిర్మాణ సమస్య తీవ్రంగానే ఉన్నది. తీవ్రతనుగురించి కాంగ్రెస్ అధిష్ఠానవర్గానికి వెల్లడించబడినది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయమై ప్రధాని నెహ్రూ మొట్టమొదట ప్రకటన చేసినప్పుడు ఆంధ్ర, కర్నాటకరాష్ట్రాలకు ఎటువంటి విచక్షణా చూపబడదని మాకు హామీ ఇవ్వబడ్డది." అని కర్నాటక కాంగ్రెస్ ప్రముఖులొకరు యునైటెడ్ ప్రెస్ విలేఖరికి తెలియజేశారు.

"రాష్ట్రకాంగ్రెస్ చేసిన తీర్మానం ఒక ఆజ్ఞవంటిది కాదు. పరిస్థితులను గ్రహించి సభ్యులు రాజీనామా నివ్వాలని విజ్ఞప్తిని మాత్రమే రాష్ట్రకాంగ్రెస్ చేసినది. దానిని సభ్యులనుసరించారు. వారు పంపిన రాజీనామాపత్రాలను రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుడుపార్లమెంటరీబోర్డుకి పంపుతాడు" అని ఆయన వివరించాడు.

## మైసూర్ సభ్యుల ప్రాతికూల్యం

బెంగుళూరు, డిసెంబరు 7: మైసూరు ప్రతినిధులుగా రాజ్యాంగపరిషత్తుకు ఎన్నుకోబడిన సభ్యులు కొందరు, మైసూరు శాసనసభ్యులు కొందరు మొత్తం 24 మంది "జనవాక్య నిర్ధారణ జరపనిదే మైసూరును కర్నాటక రాష్ట్రంలో కలపవద్ద"ని కోరుతూ నేడు భారత ప్రభుత్వానికి తంతివార్తను పంపారు. ఎవరో కొందరు చేస్తున్న ఆ దోళనను కేంద్ర ప్రభుత్వం పాటించరాదని వీరు అన్నారు. వీరిలో ప్రముఖ కాంగ్రెసువాదులు కూడా కొందరు ఉన్నారు.

## కొంకణ్ సంఘ విముఖత

కార్వార్, డిసెం 7:—"శాసన సభ్యత్వాలకు రాజీనామా ఇవ్వాలని కర్నాటక సభ్యులుచేసుకున్న నిర్ణయం ఆత్మనాశకరం కొంకణ్ ప్రజలంతా దానికి పూర్తిగా వ్యతిరేకము" అని కార్వార్‌లోని కొంకణ్ సంఘాధ్యక్షుడు నేడు ఉత్తర కనరా నుండి బొంబైశాసనసభకు ఎన్నుకోబడి, పార్లమెంటరీ కార్యదర్శిగా పని చేస్తున్న ఆర్. ఎం. ప్రభుగారికి ఒక తంతివార్తను పంపాడు.

## కర్నాటక శాసనసభ్యురాలి రాజీనామా

బళ్లారి, డిసెంబరు 8: సంయుక్త కర్నాటకరాష్ట్ర నిర్మాణమును కాంగ్రెసు కార్యవర్గం నిరాకరించినందుకు అసమ్మతి సూచకంగా కర్నాటక మంత్రులు, శాసనసభ్యులు రాజీనామాలివ్వాలని చేయబడిన విజ్ఞప్తిని అనుసరించి మద్రాసు శాసనసభలో స్వతంత్ర సభ్యురాలు శ్రీమతి ఎ. సుమంగళమ్మ తన రాజీనామాను కర్నాటక కాంగ్రెసు అధ్యక్షునికి అందజేశారని తెలుస్తున్నది.

దక్షిణ విశాఖజిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షుడుగా ఎన్నికైన శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు.

# బళ్లారిజిల్లా చరిత్ర

## "కేల్కారుతీర్పు" న్యాయసమ్మతమైనది

(ఒక బళ్లారి ఆంధ్రుడు)

బళ్ళారిజిల్లాలోని ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలను ఆంధ్రరాష్ట్రంలో చేర్చవలెనని ఆంధ్రులు, బళ్ళారి జిల్లాను విభజించరాదని, అది పూర్తిగా తమ దేనని కర్ణాటకులు వాదిస్తున్నారు.

ఈ సందర్భంలో ఈ జిల్లానుగూర్చి కొన్ని విషయాలు గమనింపతగివున్నవి.

1921 వ సంవత్సరంలో "కేల్కారు తీర్పు ననుసరించి, బళ్ళారిజిల్లాను ఆంధ్ర కర్నాటక ప్రాంతాలుగా అఖిలభారత కాంగ్రెసువారు ద్విధా విభక్తం చేశారు. అప్పటినుండీ ఈ జిల్లాలో రెండు జిల్లా కాంగ్రెసుసంఘాలు వేర్వేరుగా పనిచేస్తున్నవి. బళ్ళారి మొదలైన పడమటి ఆరు తాలూకాలు కర్నాటక కాంగ్రెసు ఆధ్వర్యంలోను, తూర్పుతాలూకాలు మూడూ ఆదోని ప్రధాన కార్యాలయుంగాగల ఆంధ్ర కాంగ్రెసు అధ్వర్యంలోను ఉంటున్నవి. కాంగ్రెసు కార్యవర్గంవారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికంగీకరిస్తూ ఇటీవల చేసినతీర్మానం, ఈ మూడు తూర్పు తాలూకాలు నిర్వివాదప్రాంతంగా ఆంధ్రలోనే చేర్చబడాలని సూచిస్తున్నది.

ఈ మూడుతాలూకాలు బళ్ళారిజిల్లాలో కల్లా భాగ్యసంపన్నమైనవి. ఆదోని గొప్ప వర్తక కేంద్రం, ప్రతిక్షేత్రం. మొత్తం జిల్లాఅంతటికీ భూమిశిస్తువల్ల వచ్చే 18 లక్షల రూ॥ ఆదాయంలో 8 లక్షల రూ॥ ఆదాయం ఈ మూడుతాలూకాలనుంచే వస్తుంది.

అధికారుల చారిత్రక రికార్డులనుబట్టి హార్పనహళ్లి మున్నగు 6 పడమటితాలూకాలు టిప్పుసుల్తాను మరణానంతరం మహారాష్ట్రుల చే జిక్కాయి. మిగతా మూడు తూర్పుతాలూకాలు నిజాము హస్తగతమైనాయి. బళ్ళారిజిల్లాను 1800 సంవత్సరములో బ్రిటిష్‌వారు నిజామునుండి మిగతా దత్తమండలాలతోపాటు స్వాధీనపరుచుకున్నారు. ఈ దత్తమండలాలన్నిటికీ సర్ థామస్ ఒక్కడే కలెక్టరుగా ఉండేవాడు. ఆలూరు, ఆదోని, కర్నూలులో కొంతభాగానికి కలిపి ఒక్కడే సబ్-కలెక్టరు, బళ్ళారిలోని మిగతా తాలూకాలకు మరొక సబ్-కలెక్టరు ఉండేవారు. 82 ఏళ్ళతర్వాత, అంటే 1882 లో రాయలసీమ ప్రస్తుతంఉన్న నాలుగుజిల్లాలుగా విభక్తమైనది.

1904 లో డబ్ల్యు. ఫ్రాన్సిస్ (ఐ. సి. ఎస్.) గెజెట్ ప్రకటిస్తూ ఇలా పేర్కొన్నాడు.

"బళ్లారిలోను, మిగతా పడమటితాలూకాల్లోను కన్నడం మాట్లాడతారు. ఆదోని ఆలూరు, రాయదుర్గములలో మాత్రం నూటికి 30, 40 మంది జనం కన్నడం మాట్లాడినా, తెలుగునే అధికసంఖ్యాకులు మాట్లాడతారు. కాని తెలుగుభాష అన్ని తాలూకాల్లో, అన్ని కోర్టుల్లోనూ పరిపాలనాభాషగా వాడబడుతున్నది."

భాషారాష్ట్ర వివాదాలులేని 1904 లోనే చెప్పబడిన ఈ మాటలు 1921 లో కేల్కార్ యిచ్చినతీర్పుకు అనుగుణంగా వుండటం గమనించదగినది. అంతేకాదు, విజయనగర సామ్రాజ్యదినములనుండి నేటి వరకూ యీ జిల్లాలోని రాజభాష తెలుగే!

సింగపూర్, డిసెంబరు 7: నిన్న నెగ్రిసెంబ్లి లాడ్‌వద్ద 40 మంది గెరిల్లాలకు పోలీసువారికి తీవ్రపోరాటం జరిగింది. ఈ పోరాటంలో, నల్గురు పోలీసువారు హతులైనారు. గెరిల్లాలలో ముగ్గురు మరణించారు. పదిమంది గాయపడ్డారు.

# జెరూసెలంపై అంతర్జాతీయ పాలన

## సమితి ప్రత్యేకరాజకీయ సంఘ నిర్ణయం

లేక్‌సక్సెస్, డిసెంబరు 7: జెరూసెలం నగరం సమితి ఆధ్వర్యాన అంతర్జాతీయ పరిపాలన క్రింద వుండవలసిందేనని ఐక్యరాజ్యసమితి ప్రత్యేక రాజకీయ సంఘసమావేశం నేడు నిర్ణయించింది. 35 రాజ్యాల ప్రతినిధులు ఇందుకు అనుకూలంగానూ, 13 రాజ్యాల ప్రతినిధులు ప్రతికూలంగానూ వోటు చేశారు. 18 మంది ప్రతినిధులు ఎటూ వోటు వెయ్యలేదు.

ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వసంఘమే జెరూసెలంనగరపరిపాలనా నిర్వాహకసంఘంగా వుండవలెననికూడా ఇదే సమావేశం నిర్ధారణ చేసింది. జెరూసెలం నగరం అంటే, అక్కడవున్న పురపాలక సంఘసరిహద్దులేగాక, పరిసర గ్రామాలు చిన్నచిన్న పట్టణాలు, బెత్‌హెం పట్టణం అనికూడా అర్థమని నిర్వచించారు.

ధర్మకర్తృత్వ సంఘం రేపు జనవరి నెలలో సమావేశమైనప్పుడు, జెరూసెలం పరిపాలనార్థం శాసనాన్ని తయారు చేసి దాన్ని వర్తింపజేస్తుంది.

అంతర్జాతీయ పరిపాలనా నిర్వహణంలో స్థానిక కక్షిదారులవల్ల ఎట్టి ఆటంకాన్ని కలుగనివ్వకూడదని ఆజ్ఞాపించడమైనది.

# అమెరికాకు జాతీయ చైనా తాత్కాలికాధ్యక్షుని రాక

శాన్‌ఫ్రాన్సిస్కో, డిశంబరు 7: జాతీయ చైనా రిపబ్లిక్ తాత్కాలికాధ్యక్షుడు, జనరల్ లీసుంగ్ జెన్, గతరాత్రి యిక్కడికి చేరుకున్నాడు. చైనా ప్రజలు కమ్యూనిస్టులకు లొంగబోరని, చైనాలో తాత్కాలికంగా తాను లేకపోయినప్పటికీ, కమ్యూనిస్టులపై చైనా ప్రజలు సాగిస్తున్న యుద్ధగతిలో మార్పేమీ ఉండదని, జనరల్ లీ ప్రకటించాడు.

పాన్ అమెరికన్ కంపెనీ విమానం అద్దెకు తీసుకొని వీరు హాంకాంగ్‌నుండి బయలుదేరారు. వీరి విమానం గతరాత్రి శాన్‌ఫ్రాన్సిస్కో విమానాశ్రయంలో దిగింది. తరువాత 'లీ' న్యూయార్కుకు బయలుదేరి వెళ్ళాడు. అక్కడ ప్రెసిబిటేరియన్ హాస్పిటల్‌లో వ్రణచికిత్స పొందుతాడట. అనంతరం అమెరికా ప్రభుత్వాధిపతులతో సంభాషిస్తాడు.

'లీ' కి ఇంగ్లీషు భాష రాదు. 'లీ' అదివరకే తయారుచేసిన పత్రికా ప్రకటనలను, వాషింగ్టన్‌లో ఉన్న ఆయన స్వంత కార్యదర్శి విలేఖరులకు అందజేశాడు. ఆ ప్రకటనలలో లీ యిలా తెలియజేశాడు.

"చైనాలో ప్రస్తుత పరిస్థితి ఆందోళనకరంగా ఉన్న మాటవాస్తవమే. సకాలంలో కమ్యూనిస్టు ఉపద్రవాన్ని అరికట్టకపోతే, ఒక్క ఆసియా ఖండమేగాదు, తూర్పున ఆగ్నేయంగా ఉన్న దేశాలు గూడా కమ్యూనిస్టు పరిపాలనను, దాని ననుసరించి వచ్చే ప్రమాదాలను ఎదుర్కోవలసి వస్తుంది. ఎన్ని అవాంతరాలు వచ్చినా చైనా ప్రజలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను రక్షించుకొనుటకు కృతనిశ్చయులై ఉన్నారు. కమ్యూనిస్టు దురాక్రమణ అనే పసుత్వానికి వారెన్నటికీ లొంగేది లేదు". 'లీ' పరివారంలో ఆయనభార్య, యిద్దరు కుమారులుగూడా ఉన్నారు.

చైనాకు అమెరికా సహాయం చేస్తే, ఫార్మోజా దీవిని 99 యేండ్లపాటు, అమెరికాకు కౌలుకివ్వడానికి, లీ సమ్మతించిన మాట నిజమేనా అని విలేఖరులు, 'లీ' స్వంత కార్యదర్శిని అడుగగా అలాంటి వార్త తానెన్నడూ వినలేదని ఆయన సమాధానం చెప్పాడు.

# త్వరలోనే ఫార్మోజాకు చైనాప్రభుత్వం మార్పు

హాంకాంగ్, డిసెంబరు 8: కమ్యూనిస్టు ముట్టడి ప్రమాదానికి గురియైన 'చెంగ్టూ' నగరంనుంచి, జాతీయచైనా రిపబ్లిక్ అధ్యక్షుని అధికారముద్ర, విమానంలో ఫార్మోజాదీవికి తరలింపబడింది. దీనినిబట్టి చెంగ్టూలోని చైనాప్రభుత్వం గూడా త్వరలోనే ఫార్మోజాకు తరలింపబడునని తెలుస్తున్నది.

తాత్కాలికాధ్యక్షుడు జనరల్ లీసుంగ్ అమెరికాకు వెళ్లినందువల, చైనా అధ్యక్షాధికారాలను జనరలిస్సిమో చాంగ్‌కైషేక్ స్వీకరించవచ్చు ననుటకు గూడా యిది నిదర్శనంగా కన్పిస్తున్నది.

ప్రభుత్వంలో, పార్లమెంటులో నూ ఉన్న సభ్యులలో అధికసంఖ్యాకులు, అధ్యక్షపదవిని పునః స్వీకరించవలసిందిగా చాంగ్‌కైషేక్‌ను కోరినట్లు, చైనా సెంట్రల్ వార్తాసంస్థ ప్రకటించింది.

## చైనా కమ్యూనిస్టు జెండా

చైనా కమ్యూనిస్టుల జెండాను చైనా రష్యాజెండా అని చాలామంది చైనీయులు వ్యవహరిస్తున్నట్లు నాన్‌కింగ్ వార్తలవల తెలుస్తున్నది.

# ఐక్యఇండొనీషియా సర్వస్వతంత్ర రిపబ్లిక్ ఏర్పడుతున్నందుకు ఐక్యరాజ్యసమితి హర్షప్రకటన

ఫ్లషింగుమెడోస్, డిసెంబరు 7: హేగు రౌండు టేబుల్ సమావేశ ఫలితంగా ఇండొనీషియా రిపబ్లిక్‌కూ, డచ్చివారికీ ఒడంబడిక కుదిరినందుకు సంతోషం వెలిబుచ్చుతూ, ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ ఈవేళ ఒక తీర్మానం చేసింది.

ఈ ఒడంబడికను సాధించడానికై డచ్చివారు, ఇండొనీషియన్లు, ఐక్యరాజ్యసమితి కమీషను చేసిన కృషినికూడా ప్రత్యేకంగా తీర్మానంలో ప్రశంసించడమైనది. ఇండొనీషియా సర్వస్వతంత్ర రిపబ్లికుగా ఏర్పాటు అవుతున్నందుకు సమితి హర్షం వెలిబుచ్చింది. తీర్మానం 44 వోట్లతో ఆమోదించబడెను; 5 రాజ్యాలు ప్రతికూలంగా వోటు చేసెనవి; ఇద్దరు తాటస్థ్యం వహించిరి.

భారతీయ ప్రతినిధివర్గ నాయకుడైన సర్ బెనెగల్ రామారావుగారు జనరల్ అసెంబ్లీలో ఉపన్యసిస్తూ, ఇండొనీషియాకు అచిరకాలంలోనే ఐక్యరాజ్యసమితి సభ్యత్వం లభించగలదని ఆశిస్తున్నామని చెప్పిరి.

సర్ బెనెగల్ రామారావుగారు సమితి ఎదుటనున్న తీర్మానమును బలపరుస్తూ ఈవిధంగా ఉపన్యసించిరి:

1949 జనవరి 28 వ తేదీన భద్రతామండలి చేసిన తీర్మానమును అనుసరించి నెదర్లాండ్సు ఇండొనీషియాలు ఒడంబడిక కుదుర్చుకోవలెనని జనరల్ అసెంబ్లీ ఇటీవల ఒక తీర్మానం చేసింది. ఈ ఆశయం ప్రకారం ఉభయ పక్షాలకు హేగ్‌లో ఆగస్టు 23, నవంబరు 2 వ తేదీల మధ్య ఒడంబడిక కుదిరింది.

ఇప్పుడు జనరల్ అసెంబ్లీలో ప్రవేశపెట్టబడిన తీర్మానం ఈ ఒడంబడిక కుదిరినందుకు హర్షం వెలిబుచ్చడంతప్ప ఒడంబడిక బాగున్నదనిగాని బాగులేదనిగాని అభిప్రాయమేమీ ప్రకటించడంలేదు. ఇది ప్రధానంగా గమనించవలసిన విషయం.

ఒడంబడిక సర్వోత్కృష్టంగా ఉన్నదని తీర్మానంలో చెప్పిఉన్నట్లయితే సభ్యులు ఎవరైనా ఆక్షేపణ చెప్పడానికి అవకాశం ఉన్నది.

కాని తీర్మానం అటువంటి దేమీ చెప్పడంలేదు. ఉభయ పక్షాలకు ఒడంబడిక కుదరవలెనని కోరుతూ జనరల్ అసెంబ్లీ లోగడ వెలిబుచ్చిన ఆశయం ఈ నాడు సఫలమైంది. ఈ ఆశయ సాఫల్యంపట్ల హర్షం వెలిబుచ్చడంలో గాని, ఆశయ సాఫల్యానికి కారణభూతులైన వివిధ పక్షాలను అభినందించడంలో గాని అసంగత మేమీలేదు. తీర్మానంలోని పదజాలం అంతా చాలా జాగ్రత్తగా ఏర్పి కూర్చబడ్డది. మునుపు అన్యోన్యం విరోధపడి ఘర్షించుకుంటున్న రెండు ప్రాంతాలు ఇప్పుడు సంధి కుదుర్చుకొని సమాధానపడ్డవి.

ఈ పరిణామము శాంతి కాముకమైన ప్రతి దేశమూ హర్షించ దగినదేగాని భ్రూభంగం చేయవలసింది కాదు.

ఒడంబడిక కుదరడంతోనే పని అంతా కాలేదు. దీనిని సవ్యమైన దోరణిలో అమలు జరపాలి. ఇండొనీషియా సమస్యపై ఢిల్లీలో జరిపిన ఆసియా దేశాల సమావేశం ఫలప్రదం అవడం ఇండియాకు ప్రత్యేకమైన గర్వ కారణం,

సమితి ఏదైతే కోరుతున్నదో అది ఈడేరినందుకు సంతోషం వెలిబుచ్చడంలో తప్పేమి ఉంది? ఈ తీర్మానాన్ని ప్రతిఘటించడం బాలిశత్వం తప్ప మరేమీ కాదు"

అనంతరం యూక్రెన్ ప్రతినిధి డెమిట్రీ మాన్యుయిల్‌స్కీ మాటాడుతూ, జనరల్ అసెంబ్లీ హేగ్ ఒడంబడికను హర్షించడానికి బదులు ఇండొనీషియా నుండి తక్షణమే డచ్చిసైన్యాలను తరలించడానికి ప్రయత్నించాలని చెప్పెను. 'అభినందన' తీర్మానానికి ప్రతిగా ఆయన ఒక స్వంత తీర్మానాన్ని సభలో ప్రవేశపెట్టెను. ఈ తీర్మానంలో చెప్పిన అంశాలు ఇవి:—ప్రస్తుతం పనిచేస్తున్న ఇండొనీషియా కమీషన్‌ను రద్దుచేసి 11 రాజ్యాలతోకూడిన ఒక కొత్త కమీషన్‌ను స్థాపించాలి. ఈ కమీషన్‌లో భద్రతామండలి రాజ్యాలన్నిటికి సభ్యత్వం ఉండాలి. ఈ క్రొత్త కమీషను ఇండొనీషియా సర్వస్వతంత్రతను గుర్తించి, తదనుగుణంగా నూతన పరిష్కార ప్రతిపాదనలను తయారు చేయాలి. ఇండొనీషియన్ రాజకీయ ఖైదీలను వెంటనే విడిచిపుచ్చాలి; ఇండొనీషియా ప్రజలమీద సాగిస్తున్న హింసాకాండ విరమించాలి." అని తీర్మానంకోరుతున్నది ఇండొనీషియాను ఛిన్నాభిన్నం చేయడానికీ, విదేశ పెట్టుబడిదారులకు ఫలప్రదమైన క్షేత్రం కల్పించడానికీ మాత్రమే. హేగ్ ఒడంబడిక ఉపకరిస్తుందని మాన్యుయిల్‌స్కీ ఆరోపణ చేసెను. అటుపిమ్మట నెదర్లాండ్సు ప్రతినిధి వాన్ హొవెన్ గొడార్ట్ ఉపన్యసిస్తూ యూక్రైన్ ప్రతినిధి ప్రతిపాదించిన తీర్మానం క్రమబద్ధం కాదనీ, ఇండొనీషియా సమస్య భద్రతామండలి అజెండాలో భాగంగా నిలిచియున్నంతవరకు అసెంబ్లీలో ఈ విధమైన తీర్మానమును ప్రవేశపెట్టడానికి వీలు లేదనీ ఆక్షేపణ తెలిపెను.

హేగ్ ఒడంబడికలో అవాంఛనీయమైన దేమీలేదనీ, ఈ ఒడంబడికను చూచి అన్నిపక్షాలు గర్వించవలసి యున్నదనీ, ఆయన చెప్పెను.

అనంతరం పాకిస్థాన్ ప్రతినిధి సర్ జఫ్రుల్లాఖాన్ మాట్లాడుతూ, హేగ్‌లో ఉభయపక్షాలకు ఒడంబడిక కుదిరినందున పాకిస్థాన్ సంతోషిస్తున్నదనీ, 4 ఏళ్ళనాడు ప్రారంభమైనఉద్యమం నేటికిసఫలమైందనీ అన్నాడు.

"ఈ ఒడంబడిక పరపాలిత రాజ్యాల స్వాతంత్ర్య యాత్రలో మొదటి మజిలీ తప్పనిసరిగా వారు ఆయుధాలు పట్టుకోవాలనే గాక ఇతర దేశాలకూడా స్వాతంత్ర్య సముపార్జన చేయగలవని విశ్వసిస్తున్నాను. సమితి ఎదుటనున్న సంయుక్త తీర్మానానికి మేము హృదయపూర్వకంగా స్వాగతమిస్తున్నాము."

# "పరిగణనకు ఇది సమయం కాదు"

## చైనాకమ్యూనిస్టు ప్రభుత్వం: డీన్ అచిసన్ ప్రకటన

వాషింగ్టన్, డిసెంబరు 8: చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించడానికి గాని, గుర్తించే అంశాన్ని గురించి ఆలోచించడానికి గాని యింకా సమయం రాలేదు" అని అమెరికన్ విదేశాంగ మంత్రి డీన్ ఎచిసన్ పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రకటించాడు.

## "డెయిలీ హెరాల్డ్" హెచ్చరిక

లండన్, డిసెంబరు 8: చైనా కమ్యూనిస్టులు కొద్దిరోజుల్లోనో, కొద్దినెలల్లోనో, బర్మా, ఇండోచైనా సరిహద్దులను సమీపించవలసి ఉంటుందని, సింకియాంగ్‌లో ప్రవేశించారంటే, భారత సరిహద్దులలో ప్రసుపర్యటనం వారికి సంబంధం యేర్పడినట్లేనని, డెయిలీ హెరాల్డ్ పత్రికలో వి. టి. స్టీలీ ఒకవ్యాసం వ్రాస్తూ హెచ్చరించాడు.

ఆసియాఖండదేశాలలో చైనా కమ్యూనిస్టులు వ్యాపించుటకు చైనా పరిస్థితులు ఎంతవేగంగా ఉపకరించగలవో యిదమిత్థంగా చెప్పలేమని గూడా ఆయన అన్నాడు.

"ఈ కమ్యూనిస్టు విస్తరణ సమస్యను పాశ్చాత్య రాజ్యాలు, సమైక్యముగా పూర్తిగా ఎదుర్కొ గల సత్తాపై ఆధారపడి ఉంటుందిగూడా, చైనాకమ్యూనిస్టులు గడ్డుసమస్యలను ఎదుర్కోవలసి లేకపోలేదు. అంతరంగికంగా ఎన్నో యిబ్బందులను ముఖ్యంగా ఆర్థికరాజకీయరంగాలలో వారనుభవిస్తున్నారనికంటే, తీవ్రమైన ప్రతిబంధకాలను ఎదుర్కొంటున్నారు" అని యీ రచయిత అన్నాడు.

# యం. అండ్ యస్. యం. రైల్వే

1949 డిశెంబరు 10 వ తేది నుంచి ఈశాన్యపులైను, దాని బ్రాంచీలమీది రైలుబండ్ల రాకపోకల వేళలు మార్చబడును. ముఖ్యమైన మార్పులు దిగువ తెల్పబడినవి. పూర్తి వివరములకు స్టేషన్లలో ప్రదర్శింపబడియున్న సవరింపబడిన షీట్ టైంటేబిల్సుమచూచుకొనవలసినదిగ ప్రజలను కోరడమైనది.

### ఈశాన్యపులైను - దిగువ బండ్లు

| | | నం. 1 | నం. 3 | నం. 31 | నం. 9 |
|---|---|---|---|---|---|
| | | కలకత్తా మెయిలు | జి. టి. ఎక్స్‌ప్రెస్ | విశాఖపట్నం ప్యాసెంజరు | విశాఖపట్నం ప్యాసెంజ |
| మద్రాసు | విడుచు వేళ | రా. 9.35 | ఉ. 10.50 | ఉ. 7.35 | రా. 7 30 |
| బెజవాడ | చేరు వేళ | ఉ. 5.38 | సా. 6 55 | రా. 11. 5 | ఉ. 9.10 |
| | వి. | ఉ. 6.14 | రా. 7.15 | రా. 11 45 | ఉ. 9.55 |
| వాల్తేరు | చే. | సా. 4. 0 | ... | మ. 12.30 | రా. 12.30 |
| | వి. | సా. 5.30 | ... | మ. 12.50 | రా. 12.56 |
| విశాఖపట్నం | చే. | ... | ... | మ. 1. 0 | రా. 1. 0 |

### ఈశాన్యపులైను - ఎగువ బండ్లు

| | | నం. 2 | నం. 4 | నం. 10 * | * నం. 32 |
|---|---|---|---|---|---|
| | | కలకత్తా మెయిలు | జి. టి. ఎక్స్‌ప్రెస్ | విశాఖపట్నం ప్యాసెంజరు | విశాఖపట్నం ప్యాసెంజరు |
| విశాఖపట్నం | వి. | ... | ... | సా. 5. 0 | ... |
| వాల్తేరు | వి. | మ. 12 10 | .. | సా. 5 25 | ఉ. 5.20 |
| బెజవాడ | చే. | రా. 9.28 | ఉ. 7.40 | ఉ. 4 55 | సా. 6.18 |
| | వి. | రా. 10. 8 | ఉ. 8 5 | ఉ. 5.40 | రా. 7.20 |
| మద్రాసు | చే. | ఉ. 7 10 | సా. 4.20 | రా. 8 35 | ఉ. 10 30 |

* * విశాఖపట్నం నుంచి గాక వాల్తేరు నుంచి బయలుదేరును.

### గుంటూరు - తెనాలి - రేపల్లె

| | | నం. 350 | నం. 330 | నం. 334 | నం. 342 |
|---|---|---|---|---|---|
| గుంటూరు | వి. | రా. 3.20 | ... | ఉ. 7. 0 | మ. 2 40 |
| తెనాలి | చే. | ఉ. 4 20 | ... | ... | ... |
| | వి. | ... | ఉ. 5.35 | ... | ... |
| రేపల్లె | చే. | ... | ఉ. 6.45 | ఉ. 10 25 | సా. 6.50 |

### రేపల్లె - తెనాలి - గుంటూరు

| | | నం. 333 | నం. 335 | నం. 345 |
|---|---|---|---|---|
| రేపల్లె | చే. | ... | ఉ. 7 15 | రా. 7 20 |
| తెనాలి | చే. | ... | ఉ. 8 25 | రా. 9.05 |
| | వి. | ఉ. 5 30 | ఉ. 9 30 | రా. 11.10 |
| గుంటూరు | చే. | ఉ. 6.25 | ఉ. 10 30 | రా. 12 20 |

### నిడదవోలు - నరసాపూరు

| | నం. 369 | | నం. 360 | నం. 364 | నం. 368 |
|---|---|---|---|---|---|
| | గం. ని. | | గం. ని. | గం. ని. | గం. ని. |
| నరసాపూరు | వి. ఉ. 8 15 | నిడదవోలు | వి. రా. 1 20 | ఉ. 10 20 | రా. 7.45 |
| నిడదవోలు | చే. రా. 12 40 | నరసాపూరు | చే. ఉ. 4.20 | మ. 1 30 | రా. 11 25 |

### సామల్‌కోట - కాకినాడ

| | | నం. 373 | నం. 381 | నం. 377 | నం. 375 |
|---|---|---|---|---|---|
| సామల్‌కోట | వి. | ఉ. 10-30 | మ. 12-40 | సా. 4.45 | రా. 7-50 |
| కాకినాడ పోర్టు | చే. | ఉ. 11.(5 | మ. 1-25 | సా. 5-30 | రా. 8-40 |

### కాకినాడ - సామల్‌కోట

| | | నం. 384 | నం. 382 | నం. 378 | నం. 380 |
|---|---|---|---|---|---|
| | | గం.ని. | గం.ని. | గం ని. | గం ని. |
| కాకినాడ పోర్టు | వి. | ఉ. 10-35 | మ. 3-25 | సా. 6-00 | రా. 9-30 |
| సామల్‌కోట | చే. | ఉ. 11-25 | సా. 4-02 | సా. 6-35 | రా. 10-17 |

### బెజవాడ - మచిలీపట్నం

| | | నం. 54 | నం. 44 |
|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. |
| బెజవాడ | విడుచు వేళ | ఉ. 6.20 | మ. 3 30 |
| మచిలీపట్నం | చేరు వేళ | ఉ. 9 25 | సా. 6.30 |

# విశాల ఉత్కళ వాంఛాసాఫల్యం

## మెహతాబ్ గ్రంథానికి పటేల్ ఉపోద్ఘాతం

న్యూఢిల్లీ, డిశంబర్ 6: ఒరిస్సాసంస్థానాల విలీనీకరణ చరిత్రనుగురించి హరికృష్ణ మెహతాబ్ గారు వ్రాసిన గ్రంథానికి, సర్దార్ వల్లభాయ్ పటేల్ ఇలా పీఠిక వ్రాశారు.

'మెహతాబ్ గారు వ్రాసిన ఈ గ్రంథాన్ని తిలకించితే పది సంవత్సరాలనాడే ఒరిస్సా భవిష్యద్రూపాన్ని గురించి ఆయన ఊహించిన చిత్రం విస్పష్టమౌతుంది. ఆనాడు ఒరిస్సా ప్రజలూ కలలు గన్న సంపూర్ణ ఒరిస్సా రాష్ట్రాన్ని సిద్ధింప చేయటంలో వారికి నేను సాయపడగలిగినందుకు సంతోషించుచున్నాను. అంతేగాక వెనకబడ్డ రాష్ట్రమని పిలువబడుతూ వుండే ఈ రాష్ట్రమే తక్కిన భారతదేశానికంతా మార్గదర్శకమై దారి తీయగలగటం మరింత ముదావహం.

'సుప్రసిద్ధ చరిత్రకారుడు గిబ్బన్ చెప్పినట్లు "ఆసియా రాజవంశాల చరిత్ర, ఒకప్పుడు ఉత్కృష్టంగానూ, ఒకప్పుడు పతనంలోనూ—ఇలా ఎడతెగని సుడిగుండంలో తిరుగుతూ వుంటుంది." పైన, అంతులేని అవధిలో ఒక సార్వభౌమత అధికారం చెలాయిస్తూ వున్న కారణంగా, ఈరాజులకు గొప్ప తేనాన్ని గాని, వీర ధర్మాన్ని గాని ప్రదర్శించే సావకాశమంటూ లేదు. ఇక ఆయా రాజవంశాల ఉత్కృష్టతగాని దీనదశ గాని ఆయా రాజుల వ్యక్తిగతమైన సుగుణ సంపద మీద ఆధారపడి వుంటుంది. బయటనుంచి మరో బలవత్తరమైన శక్తి ఎట్టూ వెసగకుండా అణచిపెట్టి ఒకమార్గాన నడిపిస్తూన్నప్పుడు సొంతం నాశనమై పోవటమంటూ కూడా వుండదు. బ్రిటిష్ వారి క్రమపరిణామ విధానాన్ని అనుసరించి ఒక చెంప పరిసర ప్రాంతాలలో ప్రజా స్వామికత వ్యాపిస్తు వుండటం మరోవైపున జాతీయ శక్తులు విజృంభించుతూ వుండడం, ఈ రెంటి మధ్యా, ఆయా సంస్థానాలు వేటిలోనూ నిరంకుశ ప్రభుత్వాలు ఎక్కువ కాలం మనటానికి వీల్లేదు.

'ఈ కోటబురుజులన్నీ ఒకటొకటే శిథిలం గావటానికి ప్రారంభించినై. అప్పుడుకూడా, రాజకీయపరిజ్ఞానంగల సంస్థానాధిపతులూ ప్రధానులూ కొన్ని పెద్దసంస్థానాలు ముందుకు తీసుకుపోగలిగారు. కొన్ని సన్నరకం సంస్థానాలు మాత్రం నిరంకుశపరిపాలనల చీకటిమునుగులో మూరటం ప్రారంభించినై. అయితే ప్రజల్లో పెంపొందుతున్న ఆర్థికరాజకీయ చైతన్యం దాని ప్రభావాన్ని అదిమాపించి నిలద్రొక్కుకోవటం ప్రారంభించి ఈ సన్నరకం సంస్థానాలనన్నిటినీ కూకటి వేళ్ళతో కదిలించివేయటానికి పూనుకుంది.'

'ఈ క్రమపరిణామం ఇలా సాగుతూ వుండగా, ప్రజలను అణచివేయటానికి ఈ నిరంకుశాధికారాలు హింసాకాండలకు పూనుకున్నయ్. ఈ స్థితిలో పైన కూర్చున్న సార్వభౌమప్రభుత్వపు ఉక్కుకోటకే బీటలుచూపినై. ఈ సంస్థానాధిపతులను దేశీయప్రజానాయకులతో సన్నిహితులు కాకుండా దూరంగా వుంచుతూ వచ్చిన విదేశీయ శక్తులు అంత్యదశకు వచ్చేసినై. తుది ప్రయత్నాల క్రింద యేదో అడ్డదిడ్డంగా ఇటొక పరడీ అటొక పరడీ వేశారు, లాభం లేకపోయింది. వారు ఎట్టకేలకు సామాన్లు చంకబెట్టి దేశం విడచి వెళ్ళవలసి వచ్చింది. వారి పోకతో దేశంలో వున్న ప్రజానీకం మధ్యవున్న అంతరాయాలన్నీ తొలగిపరస్పరం కలుసుకోవటానికి సావకాశమైంది.

'నిన్న టిడ్డాకా అంటారాని వాళ్ళ క్రింద పరిగణింపబడుతున్న వారితో రాజకీయ సంబంధాల పెంపొందించుకోవాలనే ఉత్సాహం బయలుదేరింది. సార్వభౌమత మీద ఆధారపడే పద్ధతివదలుకుని ప్రజామోదంకోసం ప్రయత్నాలు సాగినై. రాజకీయ నాయకులంటే వుండే అనుమానాలు తొలగి పరస్పర విశ్వాసాలు యేర్పడటం మొదలైనై. ఈ మార్పంతా ఒక్క రాత్రి హఠాత్ పరిణామంగా వచ్చేసింది. ప్రజా ఉద్యమాలతో సన్నిహితులైన శక్తులన్నిటినీ బలంగా కూడదీసుకుంటేగాని దేశానికి శాంతిభద్రతలు లేవని ఉభయపక్షాలూ గ్రహించాయి.

'శతాబ్దాలనాడు కళింగం ఒక మహాచక్రవర్తికి వైరాగ్యతను కలిగించి చరిత్రాంతను పొందింది. ఆయన కేవలం పరిపాలనా దక్షుడుగానే కాకుండా, మహావేదాంతిగా గురువుగా మార్గదర్శకుడుగా పెంపొంది యావద్భారతాన్నీ ఉద్ధరించాడు. ఆనాడు ఆ అశోకచక్రవర్తిక్రింద దేశమంత సమైక్యమవటానికి కళింగభూమి కారణభూతమైనట్లే, ఈ నాడుకూడా భారత సమైక్యతకు కళింగమే దారితీస్తుందని యెవ్వరూ ఊహించనైనా ఊహించని విషయం కాదు.'

# ఐక్యరాజ్యసమితిలో కాశ్మీరు వివాదం

## భారత ప్రభుత్వంపై పాకిస్తాన్ నిందారోపణ

లేక్ సక్సెస్, డిసెంబర్ 6: నేడు అయిక్యరాజ్యసమితి అసెంబ్లీలో అంతర్జాతీయ న్యాయకమిటీ నివేదికనుగూర్చి చర్చ జరుగుచున్న సందర్భములో పాకిస్తాను ప్రతినిధియగు జియాఉద్దీనుగారు ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి.

కాశ్మీరు ప్రజల అభిమత మేమిటో సరిగ్గా నిర్ణయించుటకు అవకాశమీయకుండా కాశ్మీరు సంస్థానమును భారత ప్రభుత్వము తన రాజ్యంలో కలిపివేసికోవలెనని ప్రయత్నించుచున్నది.

రమణీయమైన కాశ్మీర్ దేశములోని ప్రజలను ఇదివరకొకమారు బ్రిటిష్ వారే 100 సంవత్సరాలక్రిందట అమృతసర ఒడంబడిక ననుసరించి ఒకలక్ష పౌనులకు కాశ్మీరు మహారాజాకు విక్రయించియుండిరి. ఆ మహారాజాయొక్క నిరంకుశాధికారమునకు ఆ ప్రజలను ఒప్పగించిరి. ఇప్పుడు తిరిగి ఆ కాశ్మీర్ ప్రజలకు వారి అభిప్రాయమేమిటో వెల్లడించుటకు కూడా వారికి అవకాశమివ్వకుండా జనవాక్య నిర్ణయములేకుండా మరొక సర్వాధికార ప్రభుత్వమునకు అప్పగించుటకు ప్రయత్నించుచున్నారు.

కాశ్మీరు మతమును పరిష్కరించు నిమిత్తమై ఒక మార్గోపాయము సూచింపబడియున్నది. ఈ మార్గోపాయమును అయిక్యరాజ్యసమితి నిర్లక్ష్యం చేసే యెడల ఆసియాఖండ శాంతికిని ప్రపంచ శాంతికిని ముప్పువాటిల్లగలదు.

ఇండియా ప్రతినిధియగు సాచిన్ చౌదరీగారు యీ అసెంబ్లీ సమావేశములో కాశ్మీరు వ్యవహారమును చర్చించకూడదు. ఈ విషయము భద్రతామండలిలో చర్చింపబడవలసి యున్నది. ఇప్పుడీ విషయమును చర్చించుటవల్ల అనేక చిక్కులు ముందు జరుగవలసిన వ్యవహారములకు కలుగగలవు. భారత ప్రభుత్వము అయిక్యరాజ్య సమితికి భక్తితాత్పర్యములుకలిగి వ్యవహరించుచున్నది. అందువల్లనే యీ విషయమును అయిక్యరాజ్య సమితికి నివేదించుకొన్నాము. కాశ్మీరు ప్రజల అభిమతానుసారంగా సవ్యమైన పరిష్కార నిర్ణయము జరుగవలెనని పాకిస్తాను ప్రతినిధి కోరుచున్నాడు. అందుకు మేముకూడా అంగీకరించుచున్నాము.

అన్యాతను ఒడంబడిక ద్వారా పూర్వమెప్పుడో ఏదో జరిగినదనే విషయము ఇప్పుడు అక్కరలేదు. అప్రస్తుతము ఆ విషయమిప్పుడు చర్చిస్తే ప్రయోజనం లేదు.

పాకిస్తాను ప్రజల యిష్టానుసారమే జరుగవలెనని పాకిస్తాను ప్రభుత్వము ఇండియా ప్రభుత్వము అంగీకరించెను. కాని కాశ్మీరును బలాత్కారంగా తనలో కలుపుకొని కబళించవలెననే ఆశతో పై ఒడంబడికను అతిక్రమించి పైజెప్పిన రెండు ప్రభుత్వములలో ఏదైనను వెనుకకు మరలినయెడల అయిక్యరాజ్యసమితి మిన్నక చూచుచుండగలదా?

## మధ్యవర్తి సంఘ నివేదిక

### 17 వ తేదీన భద్రతా మండలిలో చర్చ

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 6: కాశ్మీర్ మధ్యవర్తి సంఘం తన నివేదికను పూర్తిచేసిందనీ, రెండురోజుల్లో అది సమితికార్యాలయానికి అందుతుందనీ సమితి ఉన్నతోద్యోగి ఒకరు నేడు పి. టి. ఐ. విలేఖరికి తెలియజేశారు. నివేదిక రాగానే మిమియోగ్రాఫ్ కాపీలను తీసుకుని భద్రతామండలి సభ్యులకు అందజేస్తారు.

మధ్యవర్తి సంఘసభ్యులు 15 వ తేదీకి లేక్ సక్సెస్ వస్తారనీ, భద్రతామండలి నివేదికను చర్చించేటప్పుడు అదుబాటులోనే ఉంటారనీ ఆ ఉద్యోగి వెల్లడించాడు. భద్రతామండలి 17 వ తేదీన నివేదికపై చర్చ జరుపవచ్చునని ప్రస్తుతసూచనలనుబట్టి తెలుస్తున్నది.

## లేక్ సక్సెస్ కు షేక్ అబ్దుల్లా ప్రయాణం

న్యూఢిల్లీ, డిసెంబరు 6: భారత విదేశాంగ శాఖ కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్ పాయ్, కాశ్మీరు ప్రధాని షేక్ మహమ్మద్ అబ్దుల్లా, కాశ్మీరు మంత్రి

# విజయవాడలో చిట్టిగారి విగ్రహావిష్కరణ

## నాయకులను విశ్వసింపమని సంజీవరెడ్డిగారి విజ్ఞప్తి

విజయవాడ, డిసెంబరు 5: నిన్న రాత్రి విజయవాడలో సర్దార్ మరుపిళ్ల చిట్టిగారి శిలావిగ్రహమును, మద్యనిషేధ మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఆవిష్కరించుచూ, ప్రభుత్వమును విమర్శించువారు, ప్రస్తుత స్థితిగతులను, ఆర్థికస్థితిని అర్థము చేసికొనిన బాగుండుననియు, ప్రజలు నాయకులపైన, మంత్రులపైన విశ్వాసముంచి, అభివృద్ధి కార్యక్రమముల కవసరమగు ప్రశాంతి వాతావరణమును కల్పింపవలెననియు విజ్ఞప్తి చేసిరి.

శిలావిగ్రహావిష్కరణ కార్యక్రమము విన్నకోటవారిచౌకులో, కుమారి పార్వతి, కుమారి శమంతకమణి ప్రార్థనతో ఆరంభమయ్యెను. ఆహ్వానసంఘము తరపున ఇవటూరి కోటేశ్వరరావు, వేముల కూర్మయ్యగారిని అధ్యక్షతవహించి, కార్యక్రమము నడుపగోరిరి.

ఆలపాటి వెంకటరామయ్యగారు పతాకోత్సవమును జరిపినతర్వాత, విగ్రహ నిర్మాతయైన పాగసారథికి కూర్మయ్యగారు భోనతులనిచ్చి సత్కరించిరి. భవన నిర్మాణ శాలీ వడ్రంగిపనివారల సంఘము వారు మంత్రిగారికి సన్మానపత్రమును సమర్పించిన తరువాత, వేదాంతకవి, దేదాంతం మహాదేవుడు, మందరపు సత్యనారాయణ, మంత్రిగారికైన, చిట్టిగారికైన తాము రచించిన పద్యములు చదివిరి.

పుష్పమాలాలంకృత శిలావిగ్రహమునకిరుప్రక్కల, డా॥ పట్టాభి, సర్దార్ పటేల్ గార్ల బొమ్మలు పెద్దవి ఉంచబడెను.

కూర్మయ్యగారు ప్రసంగించుచూ, చిట్టిగారు ఒక వెనుకపడ్డ, బీదకులములో పుట్టి, దేశముకొరకై అనేక కష్టములననుభవించెనని చెప్పిరి. ఇంకనుంచి కార్మికులు, వెనుకపడ్డ జాతులవారే ముఖ్యస్థానముల నాక్రమింప అర్హులనిరి.

నీలం సంజీవరెడ్డి మాట్లాడుచూ గాంధీగారి పవిత్ర ఉపదేశముల ఫలితముగా అనేకులు దేశసేవాతత్పరులు మనకు లభించిరనిరి. చిట్టిగారు దేశమునకై ఎట్టి త్యాగము చేయుటకైనను వెనుకంజవేయ్యని దేశభక్తుడు చిట్టిగారికి తన నాయకునిపై అంత విశ్వాసమున్నది. ప్రజలుకూడా తమ నాయకులపై ఇట్టి విశ్వాసమునే అలవరచుకొనవలెను. అన్యాయమును ప్రతిఘటించనివారలను అప్రయోజకులని కొందరు అనుచుందురు. కాని ప్రతిఘటించిన వారిని రౌడీలనికూడా అనుచుందురు. పీడించువారికి బుద్ధిచెప్పకపోవుట పొరపాటు. అన్యాయమును సహింపమని గాంధీగారు చెప్పలేదు. ప్రభుత్వమును నిలుచాలులేకుండగా విమర్శించువారు, కొంత మనసిమితము నలవరచుకొని, సహేతుకముగా ప్రవర్తింపవలెను. స్వరాజ్యము వచ్చి రెండేండ్లయినది. రెండేండ్లలో ఇంతకంటె ఎవ్వరునూ చేయజాలరు. మద్యనిషేధముక్రింద బోలెడు ఆదాయము లోపించినది. కేంద్రప్రభుత్వాదాయము కాశ్మీరముపై ఖర్చగుచున్నది. కాందిశీక సమస్యకు ధనము కావలసి యున్నది. పన్నులివ్వమనగా, భాగ్యవంతులకు కూడా కోపమువచ్చుచున్నది. బ్రిటిష్ హయాములో, క్షామములువచ్చి లక్షలాది ప్రజలు బెంగాలులోనూ, ఇతర ప్రాంతములలోనూ మరణించిరి. మన ప్రభుత్వమువచ్చిన తరువాత క్షామము లేలేవు—క్షామము రాకుండా చేయుటకు ప్రభుత్వము కంకణము గట్టుకున్నది. ఆహారమును దిగుమతి చేసుకొనుటలో విపరీతముగా ఖర్చులగుచున్నవి. అయినను, సంస్కరణలు క్రమక్రమముగా జరుగుచునే యున్నవి. విమర్శకులపద్ధతి "తిప్పలెన్నవారు తమతప్పు లెరుగరు" అన్నట్లున్నది అని మంత్రిగారనిరి. 'జనగనమణ' తో కార్యక్రమము ముగిసెను.

రాత్రి మంత్రిగారికి, పురప్రముఖులకు, చిట్టిగారి గౌరవార్థమై మిద్దె రామకృష్ణయ్యగారు విందు చేసిరి. (స్వ. వి.)

శ్రీ డి. ఒ. థాన్ గారలు ఐక్యరాజ్య సమితి భద్రతా సంఘ సభకు హాజరగుటకుగాను డిసెంబరు 8 తేదీన లేక్ సక్సెస్ కు బయలు దేరెదరని తెలియుచున్నది. డిసెంబరు 11 న వారు న్యూయార్కు చేరెదరు.

# చంద్రనగరు దత్తత: ఒప్పందం పరిశీలన

## భారత ప్రభుత్వ విదేశాంగశాఖ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 6: చంద్రనగరు దత్తతగురించి ఫ్రెంచి విదేశాంగశాఖవారు పంపిన ఒడంబడిక ముసాయిదా పరిశీలించబడుతున్నదని భారత విదేశ వ్యవహారశాఖ ప్రకటించింది.

అక్టోబరు 6 నవే ఈ ముసాయిదా పంపబడిందనీ, ఫ్రెంచివారు మరొక హెచ్చరిక చేసినప్పటికీ ఇండియా ప్రభుత్వం జవాబు చెప్పలేదనీ చేయబడిన ఆరోపణలు సరికావు. అక్టోబరు ఆరంభంలో ఫ్రెంచి విదేశశాఖవారు పారిసులోకి భారత రాయబారికి ఒక ముసాయిదా అనధికారరీత్యా అందించారు. కాని దానిని ఇంకా ఫ్రెంచి విదేశాంగ మంత్రి ఆమోదించలేదనీ, ఇంకా అందులో మార్పులు జరుగవచ్చుననీ అన్నారు. ఆదే ఖరారుము సాయిదా అన్నమాట నవంబరు 30న తెలుపబడింది. చంద్రనగరు విషయం సాధ్యమైనంత త్వరలో తేలవలెననే భావంతో ఉన్న భారత ప్రభుత్వం తాము స్వయంగా ఎట్టి జాప్యము చేసి ఉండలేదనీ ముసాయిదా పరిశీలించబడుతున్నదనీ ప్రభుత్వ ప్రకటన తెలుపుతున్నది.

## దేబేన్ దాసు ప్రకటన

చంద్రనగరు ఇండియాలో చేర నిర్ణయించిన నాటి నుండి ఫ్రెంచివారు చంద్రనగరు విషయంలో ద్వేషపూరితమైన వైఖరి అవలంబిస్తున్నారంటూ చంద్రనగరు పరిపాలనా సభాధ్యక్షుడు దేబేన్ దాసు ఈ కింది విషయాలు తెలిపారు:

ఫ్రెంచివారు పుదుచ్చేరినుండి తంత్రం నడుపుతూ చంద్రనగరు పరిపాలనకు అవాంతరాలు కలిగిస్తున్నారు. చంద్రనగరు స్వతంత్రమయిందని పేరే గాని ఇంకా ఫ్రెంచి యాజమాన్య పరిపాలనకిందే ఉన్నది. కేంద్ర రివిన్యూలో చంద్రనగరుకు గల భాగం, రిజర్వులో భాగం ఇంకా చంద్రనగరుకు అందజేయబడలేదు. ఒక్కొక్కసారి స్థానిక ట్రెజరీవారుకూడా బడ్జెటు ఖర్చు లివ్వకుండా ఉన్నారు.

కొంతకాలంకిందట చంద్రనగరు ప్లీడర్లిద్దరు పుదుచ్చేరిలో న్యాయమూర్తులుగా నియమించబడ్డారు. అకస్మాత్తుగా డిసెంబరు 5 న పుదుచ్చేరివారు వీరికి జీతాలివ్వ నిరాకరించి, పూర్వం పుచ్చుకొన్న జీతాలు తిరిగి ఇవ్వమనీ, జీతాలను చంద్రనగరు అధ్యక్షునివద్ద పుచ్చుకోమనీ అన్నారు.

చంద్రనగరు కాలేజీ ప్రొఫెసరుకు పారిసులో డాక్టరేటు బిరుదం ఇవ్వబడింది. ఆయన పారిసునుండి తిరిగిరాగానే ఫ్రెంచివారిచ్చిన డబ్బు వాపసుచేయమని అర్డరువచ్చింది. ఈ విధంగా ఫ్రెంచివారు ప్రతిష్టంభన తెచ్చిపెట్టడానికిగాను మానాభిమానాలు విసర్జిస్తున్నారు.

## ఆహార నియమముల వుల్లంఘన నివేదిక

మదరాసు, డిసెంబరు 6: మదరాసు రాష్ట్రమున (కడప, చంగల్పట్, కృష్ణా, తూర్పుగోదావరి, రామనాడ్ జిల్లాలు మినహా) అక్టోబరు 31 తో అంతమైనపక్షమున 764 ఆహార నియమముల ఉల్లంఘన నేరములు పరిష్కరించబడెనని ప్రభుత్వ నివేదిక తెలుపుచున్నది. విశాఖపట్నం 4, కర్నూలు 6, బళ్ళారి 10, అనంతపురం 18, మదరాసు 14, చిత్తూరు 15, నెల్లూరు 37 పశ్చిమగోదావరి 39, గుంటూరుజిల్లాలో 62 కేసులు పరిష్కరించిరి.

440 కేసులలో రు 1 నుండి 50 లు వరకు, 60 కేసులలో రు 51 నుండి రు 100 లు వరకు 28 కేసులలో రు 101 నుండి రు 500 లు వరకు జుల్మానా 57 కేసులలో 1 నెలవరకు, 49 కేసులలో నెలనుండి 3 నెలలవరకు ఖయిదు విధించిరి.

126 గురు విడుదల చేయబడిరి.

చిత్తూరుజిల్లా కాళహస్తిలో కృష్ణయ్యచెట్టి కుమారుడు మాక్షంరాజా చెట్టికి లైసెన్సులేకుండా ఆహారధాన్యముల టోకు వ్యాపారము చేసినందున రు 200 ల జుల్మానా చెల్లించనియెడల 3 మాసముల కఠినశిక్ష విధించిరి. రు 7,730 విలువగల ధాన్యములను స్వాధీనపరచుకొనిరి.

## ఉద్యోగ వార్తలు

మదరాసు, డిసెంబరు 6: గుంటూరు జిల్లా తహశీల్దార్ శ్రీ జి. అంకయ్య నాయుడు తాత్కాలికముగా అనంతపురం జనరల్ డ్యూటీ డిప్యూటీ కలెక్టరుగ నియమించబడిరి.

తూర్పుగోదావరి తహశీలార్ శ్రీ యస్. ఉమాపతిరావు, శ్రీ కే శేషాచార్యులకు బదులు తాత్కాలికముగా గుంటూరు జిల్లా, జిల్లా సప్లయి ఆఫీసరుగా నియమించబడిరి.

అనంతపురం రివెన్యూ డివిజనల్ ఆఫీసరు శ్రీ డి. కోటేశ్వరరావు అనంతపురం జిల్లా భైరవానితిప్ప ప్రాజెక్టు ఆర్థిక, ఆదాయ పరిశోధనకు స్పెషల్ డిప్యూటీ కలెక్టరుగ నియమించబడిరి.

# అటంబాంబుల అభివృద్ధి

## నాగాసాకిపై వేసిన దానికంటె గొప్పవి

### బ్రిటిష్ పత్రిక వివరణ

లండను, డిసెంబరు 7: అమెరికాలో ఏడేళ్లుగా అణువుబాంబుల అభివృద్ధికి గాను పరిశోధనలు సాగి 100 కోట్ల పౌనులు వ్యయమయింది. ఈ పరిశోధనలను గురించి "ప్రకటనార్హమైన" సంగతులను "స్టార్" పత్రిక వరుసగా ప్రకటిస్తున్నది.

అమెరికా పరిశోధనాలయాలనుండి ఇప్పటికి 5, 6, రకాల అణువు బాంబులు వెలువడినవి. వీటిలో సరికొత్తది నాగాసాకిపై వేసిన బాంబుకంటె 6 రెట్లు శక్తి కలది. హిరోషిమాపై వేసిన బాంబుకంటె నాగాసాకిపై వేసినబాంబు శక్తివంతమైనది.

ఎనివిటాక్ వద్ద ఇప్పటికి మూడు రకాల కొత్త బాంబులు ప్రయోగించబడినవి. సరికొత్త బాంబు కూడా అక్కడే ప్రయోగించబడుతుంది. ఈ సరికొత్త బాంబు హిరోషిమాపై వేసినబాంబుకంటె పెద్దదై ఉండదు. హిరోషిమాపై వేసిన మొదటి బాంబు 20 వేలటన్నుల టి. ఎన్. టి. పేలుడు మందుకు సమానమైనది. అది గొట్టంవలె ఉండి, రెండు చివరలా మందుండేది. ఈ మందు మధ్యకు వచ్చి కలవగానే బాంబు పేలేది.

ఇటీవల తయారైన బాంబులలో ఈ పదార్థాలు ఒకదానితో ఒకటి మరింత వేగంతో చేరడమో, ఇంకా అధికమైన యురేనియంగాని ప్లుటోనియంగాని వాడడమో జరుగుతున్నది.

అతిశక్తివంతమైన ఇటీవలి బాంబులలో శిలువ ఆకారంగల గొట్టాలలో నాలుగు చివరలనుంచీ ప్లుటోనియంవచ్చి మధ్యప్రదేశంలో కలుస్తుందని మనం ఊహించవచ్చు. అణువు బాంబులు విరివిగా తయారు కాకపోవడానికి కారణం యురేనియం 235 చాలా పరిమితంగా లభించడమే. కాని గత 12 నెలల కాలంలో అమెరికా శాస్త్రజ్ఞులు యురేనియం 238 ని యురేనియం 235 తో సమానమైన అణు విచ్ఛేదన శక్తి గలదిగా చేయగలమని ఆశిస్తున్నారట. ప్రపంచంలో యు 235 కంటె యు 238 నూటనలభై రెట్లు లభ్యమవుతున్నది.

మరొక కొత్తపదార్థం సహాయంతో జయ్యరెటు శక్తివంతమైన అణువు బాంబు చేస్తారట. (—గ్లోబ్)

# రాయలసీమ డెవలప్‌మెంటు బోర్డు

## అనధికార సభ్యుల నియామకం

మదరాసు, డిసెంబరు 6: మదరాసు ప్రభుత్వము ఈ క్రిందివారిని రాయలసీమ డెవలప్‌మెంటుబోర్డుకు అనధికార సభ్యులుగా నియమించెను. ప్రభుత్వము 1949 ఆగస్టులో రాయలసీమ అభివృద్ధిశాఖమంత్రి అధ్యక్షతక్రింద పై బోర్డును నియమించెను.

శ్రీ బి. అనంతాచారి యం. యల్. ఎ. టి. సుబ్రహ్మణ్యం బళ్ళారి జి. కాం. అధ్యక్షుడు, కల్లూరు సుబ్బారావు యం. యల్. ఎ. పి. లక్ష్మయ్య అడ్వకేటు, అనంతపురం, నివర్తి వెంకటసుబ్బయ్య, మల్లు సుబ్బారెడ్డి అడ్వకేటు నంద్యాల, కె. బి. నారాయణరెడ్డి యం. యల్. ఎ. పి. పార్థసారథి కోడూరు (కడపజిల్లా) ఆర్. నాదమునిరెడ్డి యం. యల్. ఎ., టి. కె. టి. వీరరాఘవాచారి రిటైర్డు డిస్ట్రిక్టు బోర్డు ఇంజనీరు చిత్తూరు, ఆర్. సూర్యనారాయణరావు యం. యల్. సి. టి. ఎ. రామలింగంచెట్టి యూర్ యం. సి. ఎ. కళా వెంకటరావు, ఆం. ప్ర. కాంగ్రెసు కార్యదర్శి.

# మ్యునిసిపల్ కవున్సిళ్ల సంస్కరణ సలహా సంఘ సూచనలు

మదరాసు, డిసెంబరు 6: రాష్ట్రములోని మ్యునిసిపల్ పరిపాలనను సంస్కరించుటకు నియమించబడిన సలహా సంఘము నేడు ప్రభుత్వ కార్యాలయములో సమావేశమైనది. శ్రీ సి. యస్. రత్న సభాపతి మొదలియార్ అధ్యక్షత వహించిరి.

మ్యునిసిపలు కవున్సిళ్లకు వయోజన ఓటింగు పద్ధతి మీద ఎన్నిక జరుగవలెనని ఏకసభ్యత్వ నియోజకవర్గములుండవలెననీ, ప్రస్తుతపు జనాభాను బట్టి మొత్తం సభ్యులు నియమించబడవలెననీ కమిటీ నిర్ణయించినట్లు తెలియుచున్నది.

మ్యునిసిపల్ కవున్సిళ్లలో హరిజనులకు మాత్రము 9 సం॥ముల వరకు ప్రత్యేక స్థానములు వుండవలెనని కూడ శిఫార్సు చేసిరి.

పైవారితోబాటు స్త్రీలకు ప్రత్యేక స్థానములు వుండవలసినవసరము లేదనియు ప్రతి మ్యునిసిపాలిటీకి మొత్తం సభ్యులలో 8 వ వంతుకు మించకుండా ఆల్డర్‌మన్ వుండవలెననియు వీరిలో విధిగా ఒక స్త్రీ వుండవలెననియు, అల్ప సంఖ్యాకులు కూడ ఎన్నికొన బడుటను వీలుగా వార్డుల విభజన జరుగవలెనని కూడ కమిటీ వారు శిఫార్సు చేసిరి.

# దేశంలో వస్త్రం కొరతలేదు

## డా॥ శ్యామప్రసాదు ముఖర్జీ గారి వివరణ

ఢిల్లీ, డిసెంబరు 6: నేడు ఇండియా పార్లమెంటులో సిధ్వాగారడిగినప్రశ్నకు బదులుగా పరిశ్రమలశాఖా మంత్రి యగు డా॥ శ్యామప్రసాదుముఖర్జీ గారిట్లు చెప్పిరి.

దేశములో బట్టల సరకు సప్లయిలో కొరతలేదు. ప్రజల కొనుబడియే ఇంకా తక్కువగా ఉంది. మనదేశంనుండి యితర దేశాలకు ఎగుమతి యగు బట్టల సరకు హెచ్చినది.

అక్టోబరు 29 తేదీనాటికి భారతదేశములోని బట్టల మిల్లులన్నింటి యందు సుమొత్తముమీద 2,16,000 బేళ్ల గుడ్డకలదు. కాని, బట్టల ధరలు హెచ్చుగా నుండుట వల్ల ప్రజలు ఎక్కువగా సరకు కొనుక్కొనుట లేదు. ప్రస్తుతం సగటున మాసవారీగా 550 లక్షల గజాల గుడ్డ ఇండియానుంచి ఎగుమతి యగుచున్నది.

విదేశగుడ్డ దిగుమతిని ఆపివేయడమే ఇండియా ప్రభుత్వపు స్థిర సంకల్పమై యున్నది.

# కృష్ణా జిల్లాలో రోడ్ల మరమ్మతు

## కావలసిన వ్యయం అంచనా

విజయవాడ, డిసెంబరు 6: కృష్ణా జిల్లాలో రోడ్లను బాగు చేయుటకు హైవేస్ శాఖవారు రూ 422400, జిల్లాబోర్డు వారు రూ 164400 వరకైననూ వెచ్చించుట అవసరమని తెలియుచున్నది. నేటి రోడ్ల స్థితిని స్థూలముగా పరిశీలించి, లెక్కవేయగా పై మొత్తములు కొంతవరకు అసలు ఖర్చుకు సమీపంలో నుండగలవట. మాగాణి ప్రాంతములలోని రోడ్లు చాలా చెడి ఉన్నవి. ప్రయాణమున కుపకరించునట్లు లేవు. ఋతుమేరు వరదలవలన చెరువుల గట్లు తెగిపోవుటవలన, అనేక చోట్ల రోడ్లు గట్లు పడిపోయినవి.

తాత్కాలికముగా కావలసిన మరమ్మతు చేయుటకు, నీటి వసతులను పునరుద్ధరించుటకు కనీసము రెండు లక్షల రూపాయలైననూ తక్షణమే కావలెనని అధికారులు అంచనా వేసిరని కూడా తెలియుచున్నది. తుపానువలన 38 పెద్ద చెరువులు గట్లు తెగినవి. 68 చెరువులు పూర్తిగా ధ్వంసమైనవి. రెండు వందలకు పైగా చిన్న చిన్న పంట చెరువులు చాలా దెబ్బతినినవి. శాశ్వతముగా ఈ నీటి సౌకర్యముల నన్నింటిని బాగు చేయవలెనన్న కనీసము రూ 12 లక్షలను ఖర్చు చేయవలసి యుండునని తెలుస్తున్నది. (స్వ. వి.)

# మన్యం జిల్లా 10 సం॥ల అభివృద్ధి కార్యక్రమం

విశాఖపట్నం, తూర్పు పడమర గోదావరి జిల్లాలందున్న మూడు ఏజన్సీప్రాంతాలందు అభివృద్ధి కార్యక్రమము యిదివరకు 8 సం॥లది 10 సం॥ల వరకు పెంచి ఆరోగ్యవిద్యావైద్యాభివృద్ధి, పంటల వృద్ధి కొనసాగింప మదరాసుప్రభుత్వం వారు ఆలోచించుచున్నారు. ఈ ప్రాంతాలను ఒకజిల్లాగా కూడా ఏర్పాటు చేయదలచిరి. మాచిఖండు ప్రాజక్టు ద్వారా విద్యుచ్ఛక్తి విరివిగా రాగలదు. కావున అచటి వనసంపదను బాగుగవినియోగింపవచ్చు. అరకులోయనుండి విశాఖపట్నానికి మదరాసు కేంద్రప్రభుత్వంవారొక రైలు వేయదలచిరి.

# అధికాహారోత్పత్తి కార్యక్రమము

## ఇరిగేషన్ స్కీములకు ప్రభుత్వ మంజూరు

మదరాసు, డిసెంబరు 6: ఆహార వుత్పత్తికి సంబంధించిన మంత్రివర్గ ఉపసంఘము నేడు సమావేశమై తంజావూరు, తిరుచినాపల్లి, నెల్లూరు, పశ్చిమగోదావరి జిల్లాల స్కీములను మంజూరు చేసిరి. గుంటూరు, బాపట్ల తాలూకాలలో కృష్ణా నదీజలములతో 50 వేల యకరముల సాగుచేయు ప్రణాళికను ప్రభుత్వము పరిశీలించుచున్నట్లు తెలియుచున్నది. ఈ స్కీమువలన ఆప్రాంతములో ఆహారోత్పత్తి అధికం కాగలదని తలచుచున్నారు. కృష్ణా ఆనకట్టకు ఎగువగా మూడు, నాలుగు ఫర్లాంగులనుండి కాలవ త్రవ్వవలెనని ప్రతిపాదనయున్నది.

# విదేశీ వ్యాపారం: 150 కోట్లలోటు

## భారత పార్లమెంటులో నియోగి వివరణ

న్యూఢిల్లీ, డిసెంబరు 6: 1949 అక్టోబరు 31తో అంతమైన ఏడు నెలల కాలంలో ఇండియా విదేశవ్యాపారంలో 150 కోట్ల 41 లక్షలు లోటు వచ్చినట్లు నేడు భారత పార్లమెంటులో ప్రశ్నల సమయంలో వాణిజ్యమంత్రి కే. సి. నియోగీ చెప్పారు.

ఈ లోటు తొలగించడానికి ప్రభుత్వం వారు ఈవిధానాలు అవలంబించారు: ఓ. జి. ఎల్. 11 స్థానే ఓ. జి. ఎల్. 15 అమలు జరపడం; జూను 25 నుంచి సెప్టెంబరు 7 వరకు డాలరుప్రాంతాలనుంచి జరిగే దిగుమతులకు లైసెన్సులు నిరాకరించడం; మే నెలనుండి విలాసవస్తువుల దిగుమతులకు లైసెన్సులు నిషేధించి, దిగుమతులు తగ్గించడానికి వీలుగా దిగుమతిలైసెన్సువిధానం సంస్కరించడం; ఎగుమతులపై నిర్బంధాలు సడలించి, ఎగుమతికంట్రోలు కేంద్రీకరించడం; ఎగుమతి విధానాన్ని సరళీ పరచడం.

పైన చెప్పిన ఏడు మాసాలలోనూ జరిగిన ఎగుమతులఖరీదు 220 కోట్ల 91లక్షలు. దిగుమతుల ఖరీదు 381 కోట్ల 22 లక్షలు.

# జనవరి 26 న కొత్త కరెన్సీ నోట్లు

బ్రిటిషురాజు తలకుబదులు, అశోకస్తంభ శిఖరాన్ని ముద్రించిన కొత్తకరెన్సీనోట్లు జనవరి 26 వ తేదీనుంచి అమల్లో పెట్టబడతవని ఆర్థికమంత్రి డా॥ మత్తయ్ ఆర్. కె. సిధ్వా అడిగినప్రశ్నకు సమాధానమిస్తూ వెల్లడించారు. కొత్త నోట్లను ముద్రించే వాటర్‌మార్కు కాగితం బ్రిటన్ నుంచి రావటానికిఆలస్యంకావటంవల్లనూ, పాతనోట్లను ఉపయోగించ వలసిన అవసరం ఉండుటవల్లనూ అంతవరకూ ఆగవలసి వచ్చిందని ఆయన అన్నాడు.

# పాలిత ప్రాంత పరిస్థితుల పరిశీలన కమిటీ

న్యూయార్కు, డిసెంబరు 6: పాలిత ప్రాంతాల పరిస్థితులను వివరిస్తూ పాలక రాజ్యాలు సమర్పించిన నివేదికలను పరిశీలించటానికి సమితి నిన్న నియమించిన ప్రత్యేక సంఘాన్ని సామ్రాజ్య దేశాలయిన బ్రిటన్, ఫ్రాన్సు, బెల్జియంలు బహిష్కరించవచ్చునని న్యూయార్కు టైమ్సు పత్రిక నేడు ప్రకటించింది. ఈ విషయంగా చెప్పటానికి గట్టి ఆధారాలు కనిపిస్తున్నవని ఈ పత్రిక వ్రాసింది.

సమితి నియమించిన ప్రత్యేక సంఘంలో 8 ఇతర దేశాలు ఉన్నవి. ఇతర దేశాలు అంటే పాలక దేశాలు కానివి. ఇందులో ఉండకూడదనీ, సమితి అక్రమంగా ఈ పరిశీలనాధికారం తీసుకుంటున్నదనీ బ్రిటన్, ఫ్రాన్సు, బెల్జియంలు ప్రతిఘటించినవి.

బ్రిటన్ బహిష్కరణ చూస్తే అది వలసల విషయమై శాశ్వతంగా నిష్క్రమించటానికి దారితీసేట్లు కనిపిస్తున్నదని సమితి ప్రతినిధి వర్గాల వారు భావిస్తున్నారు.

# ఇండియాకు నోయెల్ బేకర్ రాక?

లండన్, డిసెంబరు 6: బ్రిటిషు కామన్వెల్తు సంబంధాల కార్యదర్శి సింహళంలో జనవరిలో జరిగే కామన్వెల్తు సమావేశానికి వచ్చినప్పుడు ఇండియా పాకిస్తానులు కూడా చూస్తారనీ, జనవరి 26 వ రిపబ్లికు ప్రారంభోత్సవంలో పాల్గొంటారనీ పేటెంట్రి అభిజ్ఞులు చెప్పారు. ఈయన ఇంతవరకు ఇండియాపాకిస్తానులు చూచి ఉండలేదు.

కొలంబో సమావేశానికి వెళ్ళే బ్రిటిషు ప్రతినిధుల పేర్లను ప్రభుత్వం ఇంకా ప్రకటించలేదు. బ్రిటిషువిదేశకార్యదర్శి బెవిన్ మటుకు భార్యాసమేతంగా యుద్ధనౌకలో ప్రయాణంచేసి సమావేశానికి పోతారని మాత్రం భావించబడుతున్నది. అక్కడి నుండి ఇండియాకు వచ్చేఓపిక ఆయనకు ఉండేదీ లేనిదీ తెలియదు.

# సింహళ శాంతి సభ కమ్యూనిస్టుల యత్నం

కొలంబో, డిసెంబరు 6: ఇక్కడ జనవరి నెలలో బ్రిటిషుకామన్వెల్తు విదేశమంత్రుల సమావేశం జరిగే కాలముందే అఖిల సింహళ శాంతిమహాసభ ఏర్పాటుచేయడానికి సింహళ కమ్యూనిస్టులు ప్రయత్నిస్తున్నారు.

ఫ్రెంచి అణుశాస్త్రజ్ఞుడైన జోలియో క్యూరీనీ, మాస్కోలో ఉపన్యాసం చేసి నందుకు బ్రిటిషు అసోసియేషను సలహా సంఘంలో తన స్థానాన్ని కోల్పోయిన ప్రొ. డి. బెర్నాలునూ మహాసభలో మాట్లాడమని ఆహ్వానించ నిశ్చయించారట.

# అపహృత స్త్రీల పునరుద్ధరణ

## గోపాలస్వామి అయ్యంగారి వివరణ

న్యూఢిల్లీ, డిసెంబర్ 6: ఈ వేళ ఇండియన్ పార్లమెంటులో లక్ష్మీనారాయణ సాహూ మొదలైన సభ్యు లడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానంగా అపహృత స్త్రీల పునరుద్ధరణ కార్యక్రమాన్ని గురించి గోపాలస్వామి అయ్యంగారు ఈ దిగువ వివరాలు తెలియజేశారు:

'పాకిస్తాన్‌లోకి యెత్తుకుపోబడిన హిందూ, శిక్కు అపహృత స్త్రీ శిశువుల సంఖ్య మొత్తం 33000 వీరిలో అక్టోబర్ నెలాఖరులోగా పాకిస్తాన్‌నుంచి భారతదేశానికి తిరిగి పంపివేయబడిన వారు 6 173 మంది. ఆ తేదీలోగా భారతదేశం నుంచి పాకిస్తాన్‌కు పంపబడిన ముస్లిం అపహృతులు 1,21,185.

ఈ విషయమై భారతప్రభుత్వం పాకిస్తాన్‌తో ఒక ఒడంబడిక చేసుకున్నది. ఈ అపహృత స్త్రీలను పునరుద్ధరించే విషయంలో శక్తివంచనలేకుండా పనిచేస్తామని పాకిస్థాన్ ప్రభుత్వంవారు హామీ యిచ్చారు. పాకిస్థాన్‌లో పునరుద్ధరణ కార్యక్రమం కొంత సాగుతున్నది. కాని చురుకుగా పనిజరగటంలేదు.

'గడచిన ఫిబ్రవరి అక్టోబరుల మధ్య భారతదేశంనుంచి పాకిస్థాన్‌కు 2,268 మంది అపహృత ముస్లిం స్త్రీ శిశువులను పంపించాం. ఆ సమయంలో పాకిస్థాన్ నుంచి పంపబడినది 502 మంది మాత్రమే.

'కాశ్మీర్ స్త్రీలు ఎంతమంది హరింపబడినది ఇంకా లెక్క తేలలేదు. ఈ విషయంలో కూడా పాకిస్థాన్‌తో మరో ఒడంబడిక జరిగింది.

'పునరుద్ధరింపబడిన అపహృతలను పాకిస్థాన్ భారతప్రభుత్వాలు ముందు లాహోర్ అమృతసర్‌లకు చేరుస్తవి. అనంతరం అక్కడవారిని విచారించి యెవరి ప్రదేశాలకు వారిని పంపే యేర్పాట్లు జరుగుతున్నయ్.'

# ఇండియాలో టెలిఫోన్ తీగెల ఉత్పత్తి

## బ్రిటిష్ కంపెనీతో భారత ప్రభుత్వ ఖరారు

న్యూఢిల్లీ, డిసెంబర్ 6: భారతదేశానికి కావలసిన టెలిఫోన్, కేబుల్ తీగ నంతటినీ తయారుచేసే ఫ్యాక్టరిని ఇండియాలో స్థాపించే విషయమై భారతప్రభుత్వం స్టాండర్డ్ టెలిఫోన్సు అండ్ కేబుల్సు కంపెనీ (లండన్) తో ఒక ఒప్పందం చేసుకున్నది. భారత హైకమిషనర్ కృష్ణమీనన్ ఇండియా తరఫున నవంబర్ 30 వ తేదీన ఖరారునామాపై సంతకం చేసినట్లు తెలుస్తున్నది. ఒడంబడిక 20 సం॥లవరకూ వర్తిస్తుంది.

ఈ 20 సం॥ లూ స్టాండర్డ్ కంపెనీ టెలిఫోన్‌కు సంబంధించిన విషయాల్లో భారత ప్రభుత్వానికి సలహాదారుగా ఉంటుంది. ఇండియాలోని ఫ్యాక్టరీలో ఆ కంపెనీ పేటెంట్లను తయారు చేయవచ్చును. ఫ్యాక్టరీ నిర్మాణం విషయమై భారతప్రభుత్వానికి ఈ కంపెనీ సలహాలిచ్చి, భారతీయులకుశిక్షణ నిస్తుంది. ఈ ఫ్యాక్టరి తను గొనే కొత్త వస్తువులను తయారు చేసుకునే హక్కు కంపెనీకి ఇవ్వబడుతుంది.

ఫ్యాక్టరీకి కావలసిన యంత్రాలు బ్రిటన్‌లోనే కొంటారు. ఏస్థలంలో స్థాపించేదీ నిర్ణయంకాలేదు. భారతప్రభుత్వమే దీనికి స్వంతదారు. మూడు నాలుగేళ్ళలో ఏడాదికి కోటిరూపాయల సరుకును తయారు చేయకలుగుతుందని తెలుస్తున్నది.

# బ్రిటన్ స్టర్లింగ్ బాకీలు ఎగవేస్తే

## ఏంచేయాలో తెలుసని డా॥ మత్తయ్ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబర్ 7: "స్టర్లింగ్ బాకీలను బ్రిటన్ ఎగవేయటమే జరిగితే ఏమిచేయాలో భారత ప్రభుత్వానికి తెలుసు" అని ఆర్థికమంత్రి డా॥ మత్తయ్ నేడు పార్లమెంటులో ప్రకటించారు.

బ్రిటిష్ ప్రధాని అట్లీ, అక్టోబర్ 27 వ తేదీన కామన్సు సభ స్టర్లింగ్ బాకీలపై జరిపిన చర్చలో ప్రసంగిస్తూ "సాధ్యమైనంతవరకూ వాటిని మనం కోయవలసివస్తుంది" అని చెప్పిన అంశాన్ని గమనించాం అని ఒకరు వేసిన ప్రశ్నకు సమాధానమిస్తూ ఆర్థికమంత్రి పై ప్రకటన చేశాడు.

"స్టర్లింగ్ బాకీలవిషయమై హామీ ఇస్తూ బ్రిటిష్‌ప్రభుత్వం నాకు తెలియజేసిందికూడా. అప్పులు తగ్గించాలని కానీ, ఇండియాను ఇబ్బంది పెట్టాలని గానీ, తమకు తామే ఎటువంటి చర్య తీసుకోవటం కానీ జరగదని బ్రిటిష్ ప్రభుత్వం హామీ ఇచ్చింది" అని ఆయన వివరించాడు.

# రైలు మార్గాలకు కావలసిన పరికరాలు

## ఇండియాలోనే తయారుచేసే సన్నాహాలు

బొంబాయి, డిసెంబరు 7: ఇండియన్ రైల్వేలకు కావలసిన కొన్ని కొన్ని ఇంజనీరింగు పరికరాలను ఇండియాలో తయారు చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

ఈమధ్య ఇండియన్ ఇంజనీరింగ్ అసోసియేషన్ వారు రైల్వేబోర్డువారిని కలుసుకొని ఈవిషయమై సంప్రదించారు.

రైల్వేలకు అవసరమైన విడిసామానులను భారీఎత్తున సరఫరా చేసేందుకు వీలుగా సమాహారమైన ప్రయత్నం చేయడానికిగాను ఒక జాయంటుకమిటీని ఏర్పాటు చేయవలసిందిగా వీరు రైల్వేబోర్డుకు సూచించారు.

భారత పారిశ్రామిక కేంద్ర సలహా సంఘంవారున్నూ ఆర్థికమంత్రి సర్దార్ వల్లభాయి పటేల్‌గారున్నూ చేసిన విజ్ఞప్తులను పురస్కరించుకొని వీరు ఇందుకు నడుంకట్టుకున్నారు.

ప్రస్తుతం భారతప్రభుత్వం నడిబజార్లో ఈ సరుకులు కొంటున్నది. అందువల్ల విదేశీ వ్యాపారులతోను, ఇతరులతోను పోటీ చేయడం భారత పరిశ్రమలకు కష్టం అవుతున్నది. భారత ప్రభుత్వం గనుక ఈ పద్ధతిని మానుకుంటే తాము సరసమైన ధరలకు వాటిని ఇండియాలో తయారుచేయగలమని ఈ అసోసియేషన్‌వారు అంటున్నారు.

# 'పాకిస్థాన్‌లోని ఖుల్నా జిల్లా ఇండియాలో చేరాలి'

న్యూఢిల్లీ, డిసెంబరు 6: ఖుల్నాజిల్లా కాంగ్రెస్ సరిహద్దు సంఘం ఆ జిల్లాను ఇండియాలో చేర్చడాన్ని గురించి శ్రద్ధ వహించవలసినదని కోరుతూ భారత ప్రభుత్వానికి ఒక మెమొరాండం పంపుకున్నారు.

ఖుల్నాలో హిందువులు అధిక సంఖ్యాకులుగా వున్నా రాడ్‌క్లిఫ్ అవార్డు వల్ల పాకిస్థాన్‌లో చేరిపోవలసివచ్చింది.

ఇప్పుడు లాల్ జస్టిస్ బెగ్గీ అధ్యక్షతను కలకత్తాలో పని చేస్తున్న అంతరధిని వేళ వివాద పరిష్కార సంఘముందు ఈ విషయాన్ని వుంచవలసిందిగా ఖుల్నా కాంగ్రెస్ సరిహద్దుసంఘం ఇండియా ప్రభుత్వాన్ని కోరింది.

# మానవహక్కుల ప్రణాళిక ప్రాశస్త్యం

## బొంబై ప్రధాన న్యాయమూర్తి ప్రశంస

బొంబాయి, డిసెంబర్ 6: మన దేశాభివృద్ధిని కాంక్షించు వారందరికి ఐక్యరాజ్య సమితి మానవహక్కుల ప్రణాళిక శంఖధ్వానముగా నుండవలెనని తత్ ప్రకటన వార్షికోత్సవములో నుపన్యసించుచు బొంబాయి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ చగ్లాగారు చెప్పిరి.

"మానవహక్కుల ప్రణాళిక మహోదాత్త గంభీరపత్రిక. ఈ ప్రణాళిక పురుషులకును, స్త్రీలకును సమానత్వమొసంగుచున్నది. నల్లవారైనను సరే, తెల్లవారైనను సరే అందరికీ వ్యక్తిత్వమునకును ఈ ప్రణాళిక ప్రాముఖ్యమొసంగుచున్నది. ఇది చాలా ముఖ్యమైన విషయము. సాంఘిక న్యాయమునకు గూడ ఈ ప్రణాళిక ప్రాముఖ్య మొసంగుచున్నది. సాంఘిక న్యాయ మేర్పడినగాని ప్రజాప్రభుత్వములు తమ నిజలక్ష్యమును సాధించజాలవని ప్రణాళిక ఉద్ఘాటించుచున్నది. ప్రతి దేశము ప్రయత్నితః సాధించవలసిన లక్ష్యములను, గమ్యస్థానమును ఈపత్రము సిద్ధాంతరూపేణ నిర్వచించుచున్నది. సమితిలో సభ్యత్వము వహించియున్న అన్ని దేశములు ఈ సిద్ధాంతములను ఆచరణలో నుంచవలెను. కొద్దిరోజులక్రిందనే ఆమోదింపబడిన భారత రాజ్యాంగవిధానములో ఈసిద్ధాంతములన్నియు పొందుపరుపబడియున్నవి. జనవరి 26 తేదీన అమలులోనికి రానున్న ఈ రాజ్యాంగ విధానములో ఈ సిద్ధాంతములు; శాసన రూపమునగాని, ఉత్తరువుల రూపమునగాని పొందుపరుపబడియున్నవి. వీనిని రాష్ట్రములు, కేంద్రము ఆచరణలో పెట్టవలసి యుండును." అని న్యా॥ చగ్లా గారు చెప్పిరి.

సభాధ్యక్షత వహించిన టెంబర్ లెక్ గారు, అమెరికా కాన్సల్ జనరలు ఉపన్యసించుచు మానవకోటి సుఖమునకు సాధనభూతములగు ఉన్నత సిద్ధాంతములు ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల ప్రణాళికలో పొందుపరుపబడియున్నవనిరి. ఈ సిద్ధాంతములను బాగుగా అమలు చేసిన యెడల ప్రపంచమునకు శాంతిసౌఖ్యములు, అభివృద్ధి చేకూరుట నిశ్చయమనిరి.

# బొంబాయి హైద్రాబాద్‌లలోని 'లంకలు'

## పరస్పర స్వాధీనానికి ప్రభుత్వ నిర్ణయం

బొంబాయి, డిసెంబరు 6: హైద్రాబాద్ సంస్థానంలో బొంబాయికి చెందిన గ్రామాలను హైద్రాబాద్‌లోనే కలిపి వేయుటకును, బొంబాయి రాష్ట్రంలో గల హైద్రాబాద్ ప్రాంతాలను బొంబాయిలోనే కలిపివేయుటకును ఉభయ ప్రభుత్వాలమధ్య తాత్కాలిక నిర్ణయం జరిగినట్లు తెలియవచ్చింది. దీనివల్ల హైద్రాబాద్‌కు దాదాపు వంద గ్రామాలు, బొంబాయికి వందగ్రామాలు, వస్తవి అయితే షోలాపూరు జిల్లాలో గల బర్షీ తాలూకా, నగర్ జిల్లాలోని జంఖేడ్ మహల్‌వంటి పెద్దపెద్ద ప్రాంతాలు యీ నిర్ణయం కిందకురావు. ఈ రెండుకూడ హైద్రాబాద్ సంస్థానంలో గల బొంబాయి ప్రాంతాలు. వీటి పరిపాలనా నిర్వహణను బొంబాయి ప్రభుత్వమే కొనసాగిస్తుంది. ఈ నిర్ణయంపై భారత ప్రభుత్వ సంస్థానశాఖ ఏదైనా చర్య తీసుకోటానికి ముందు ఉభయ ప్రభుత్వాలు దీనిని ఆమోదించవలసియున్నది. ఢిల్లీలో డిసెంబరు 2 న సంస్థానశాఖచే ఏర్పాటు చేయబడిన బొంబాయి, మదరాసు, హైద్రాబాద్, తిరువాన్కూర్, కొచిన్ సమాఖ్య ప్రభుత్వ ప్రధాన కార్యదర్శుల సమావేశంలో యీ నిర్ణయం జరిగింది.

సిరోహి సంస్థాన విషయమై కూడ యీ సమావేశంలో నిర్ణయం జరిగినట్లు తెలుస్తున్నది. ఈ సంస్థానం విభజించబడి, ఒకభాగం బొంబాయిలోను, మిగిలిన భాగం విశాల రాజస్థాన్‌లోను కలిపి వేయబడతవి. 1950 జనవరి 26 కు ముందే యీ విభజన జరుగునని యిక్కడ అధికార్లు భావిస్తున్నారు.

# మునగాల భవిష్యత్తు

చెన్నపట్నం, డిసెంబరు 7: మునగాలను ప్రభుత్వమే ఉంచుకొని లింగగిరిని హైద్రాబాదునకు ఇచ్చుటకు పరిటాలను మద్రాసుప్రభుత్వం తీసుకొనుటకు నేడు మంత్రివర్గం తీర్మానించెను.

మద్రాసు రాష్ట్రంలోని హైద్రాబాద్, మైసూరు ప్రాంతములు మద్రాసునకును హైద్రాబాద్, మైసూరు లలోని మద్రాసు ప్రాంతము ఆయా సంస్థానముల కిచ్చుటకు ప్రభుత్వం తీర్మానించినది. గవర్నరు జనరల్ ఉత్తర్వు ద్వారా ఈ మార్పు జరగగలదు. హైద్రాబాదులో మార్పు మద్రాసుకు లాభించినదిగాని మైసూర్ గ్రామాలమార్పు నష్టమని ప్రధాని నేడు పత్రికాప్రతినిధులకు తెలిపిరి.

# ముగ్గురు రజాకార్ నాయకులకు మరణదండన

## ప్రత్యేక న్యాయవిచారణ సంఘంచే విధింపు

సికంద్రాబాద్, డిసెంబరు 7: ఔరంగాబాద్ జిల్లా లడసవంగి, వరూడ్ గ్రామాలలో హత్య, దోపిడీ, గృహదహనం మొదలైనవి జరిపిన నేరానికి ముగ్గురు రజాకార్ నాయకులకు ప్రత్యేక న్యాయవిచారణ సంఘంచే ప్రాణదండన విధించబడెను. మరిముగ్గురు రజాకార్లకు యావజ్జీవశిక్ష విధించబడెను.

ఈ ప్రత్యేక న్యాయవిచారణ సంఘం డిసెంబరు 15 న రద్దవునని తెలుస్తున్నది.

# నల్గొండ జిల్లాలో గత పక్షంలో 6 హత్యలు

హైద్రాబాద్, డిసెంబరు 6: నవంబరు 30 తో అంతమగు పక్షంరోజులలోను నల్గొండలో కమ్యూనిస్టులచే 6 హత్యలు జరుపబడినాయని అధికారరీత్యా తెలియవచ్చింది. దీనితో 1949 జనవరి నుండి యీ జిల్లాలో కమ్యూనిస్టులచే జరుపబడిన హత్యల సంఖ్య 200 అయినది. జిల్లాలో రెండు సంఘటనలు జరగటం మినహా కమ్యూనిస్టు ఉద్యమం చాల వరకు తగ్గిందనే చెప్పవచ్చును. రోడ్డు రవాణాశాఖకు చెందిన బస్సుపై దాడి చేయుట, ప్రభుత్వ వైద్యాధికారిని హత్య చేయుట యీ రెండు సంఘటనలు. కమ్యూనిస్టులు 'కొట్టి, పారిపోయే' ఎత్తులు సాగిస్తున్నారట. వీరు మిర్యాలగూడెం, హుజూర్‌నగరం తాలూకాలలో దాడులుజరిపి, కృష్ణానదిని దాటి గుంటూరు జిల్లాలోకి పారిపోతున్నారట. నవంబరు 26 న ఒక విధ్వంసకుడు నదిని దాటుతుండగా పోలీసులచే కాల్చిచంపబడెను. మిర్యాలగూడెం తాలూకాలో తంగపాడువద్ద నవంబరు చివరివారంలో విధ్వంసక దళం ఒకటి రోడ్డు రవాణా శాఖకు చెందిన బస్సును ఆపివేసి నేలమర్రి నేత ముఖ్ వెంకట నరసింహారెడ్డిని కాల్చి చంపి వేశారు. బస్సు కండక్టరు నుండి డబ్బు పంచి ఎత్తుకొని పోయారు.

హైద్రాబాద్ జిల్లాలో యీ పక్షం రోజులలో ఏగురు హత్య చేయబడినారు. సాయుధ,కమ్యూనిస్టుల దళం ఒకటి ఇబ్రహీం పట్నంలోని పోలీసు శాఖాపై దాడిచేసి ఒకరిని హత్యచేసి ఒక కానిస్టేబులుకు గాయాలు కలిగించారు. వీరు పోతూ 4 తుపాకులను ఎత్తుకొని పోయారు. దర్యాప్తు జరుగుతున్నది.

# హైద్రాబాద్ రాజ్యాంగ పరిషత్ ఎన్నికలు

## మార్చినాటికి జరగొచ్చునని సర్దార్ పటేల్

న్యూఢిల్లీ, డిసెంబర్ 7: హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తుకు 1950 మార్చి నాటికి ఎన్నికలు జరగవచ్చుననీ, ఎన్నికలు అయ్యేవరకూ ఇతర మార్పులను గురించి ఏమీ చెప్పటానికి వీలులేదనీ భారత ఉపప్రధాని సర్దార్ పటేల్ నేడు పార్లమెంటులో ఒక ప్రశ్నకు లిఖిత పూర్వక సమాధానమిస్తూ వెల్లడించారు. ఎన్నికలు పూర్తి అయిన తరువాత పరిస్థితులపై సమీక్ష జరుగుతుందని ఆయన అన్నారు.

సంస్థానంలో కమ్యూనిస్టు దౌర్జన్యాలను గురించి మాట్లాడుతూ అధికారులు పట్టుదలతో పనిచేయుటంవల్ల అశాంతి స్థానికంగా పరిమితం చేయబడినదనీ, మొత్తం మీద పరిస్థితులు అదుపులోనే ఉన్నాయనీ ఆయన ప్రకటించాడు.

### ఆర్. ఎస్. ఎస్: సైనికశిక్షణ

రాష్ట్రీయ స్వయం సేవకసంఘం తన సభ్యులకు సైనికశిక్షణ నివ్వకుండా ఉండటానికి అంగీకరించిందా?" అని ఆర్. ఎల్. మాలవ్యా అడిగిన ప్రశ్నకు ఆయన ఈ కింది సమాధానం ఇచ్చాడు.

"సైనిక శిక్షణ నివ్వనని ఆర్. ఎస్. ఎస్. మాట ఇచ్చే ప్రసక్తేలేదు. ప్రభుత్వానుమతి లేనిదే ఏఅనధికార సంస్థా సైనిక శిక్షణ నివ్వటానికి వీలులేదు.

### నేతాజీ బోస్

ఇషాపూర్ ఆయుధ ఫ్యాక్టరీలో ఉన్న నేతాజీబోస్ ఫోటోను ఎవరో తీసివేశారని చెపుతూ ఆయనపట్ల రక్షణశాఖ వారు అగౌరవం చూపుతున్నారా అని హెచ్. వి. కామత్ వేసిన ప్రశ్నకు రక్షణమంత్రి బల్దేవ్ సింగ్ ఈవిధంగా జవాబిచ్చాడు. "ప్రభుత్వానికి నేతాజీబోస్ మీద పూర్ణవిశ్వాసం ఉన్నది. ఆయనపట్ల అగౌరవం చూపించే ప్రసక్తేలేదు. ఇషాపూర్ ఫ్యాక్టరీలో నేతాజీ ఫోటోను తొలగించలేదు. అది మరొక గదిలోకి మార్చబడింది.

# పార్లమెంటులో హిందీ ఉపన్యాసం

## ముస్లిం సభ్యుని ఆక్షేపణ

న్యూఢిల్లీ, డిసెంబరు 6: ఇండియా పార్లమెంటులో ఒక సభ్యుడు హిందీలో మాట్లాడటం ప్రారంభించే సరికి నజీరుద్దీన్ అహ్మద్ ఒక పాయింట్ ఆఫ్ ఆర్డర్ లేవదీస్తూ హిందీలో ప్రసంగించడాన్ని ఆక్షేపించ పెట్టారు.

తాను ఆక్షేపించడం తీసుకురావడానికి ఆయన రెండు కారణాలు చూపెట్టారు (1). సభకు అధ్యక్షత వహిస్తున్న అనంతశయనం అయ్యంగారు దక్షిణాదినుంచి వచ్చారు కాబట్టి ఆయనకు హిందీ అర్థం కాదు. అందువల్ల సభ్యుడేదన్నా అనవసర ప్రసంగం చేస్తున్నప్పుడు ఆయన అతన్ని వారించలేడు. (2) ఆయన మాటాడుతున్న దానికి ప్రత్యుత్తరం ఇవ్వవలసిన అవసరంవుంటే, ఆర్థిక మంత్రికి హిందీ రాదు కాబట్టి అసలు ఏమ్మనపోయేడై పోతాడు.

అందుమీదట శ్రీ అనంతశయనం అయ్యంగారు అందుకొని తనకు అంతమాత్రం హిందీ వచ్చునన్నారు. డా॥ మత్తయ్ తాను ఆ ఉపన్యాసాన్ని తనకు తెలిసిన భాషలోకి క్లుప్తంగా తర్జుమా చేయించుకోగలనన్నారు.

ఠాకూర్ క్రిషన్‌సింగ్ అనే ఆయన సుంకచట్టాలను సెలెక్టుకమిటీకి పంపాలని జాన్ మత్తాయ్ తెచ్చిన ప్రతిపాదనమీద మాట్లాడుతూ వున్న సందర్భంలో యీ వ్యవహారం జరిగింది. శ్రీ క్రిషన్ హిందీలో ఉపన్యసించారు.

# తుపాను బాధితుల సహాయానికై కళ్యాణి ఆంధ్రుల కృషి

కళ్యాణి, డిసెంబరు 6: ఇటీవల ఆంధ్రదేశంలో వచ్చిన తుపానువల్ల నష్టపడిన బాధితుల సహాయార్థం నిధి సేకరించుటకు గాను కళ్యాణి ఆంధ్రసంఘంవారు నాయకులైన వెంకటసుబ్బారావు, సూర్యనారాయణ, తాతా శ్రీరాములు పాకాల రామారావు గార్లతో ఒక సంఘము నియమించారు. ఈ నిధికి విరివిగా విరాళా లివ్వవలసిందని కళ్యాణి కాంగ్రెస్ సంఘంవారు, పురప్రముఖులు విజ్ఞప్తులు చేశారు. ఇప్పటివరకు 300 రూపాయలు సేకరించబడినవి.



డా॥ రాజేంద్రప్రసాద్ 65 వ జన్మదినోత్సవ సమయంలో పండిట్ నెహ్రూ ఆయన నభినందిస్తున్న దృశ్యం.

# 'ధాన్యం తీరువ బదులు రొక్కం తీరువే వసూలు చెయ్యాలి'

## పల్లిపట్టు తాలూకా రైతుకాంగ్రెస్ సభ తీర్మానం

నగరి, డిసెంబరు 6 పల్లిపట్టు తాలూకా రైతుకాంగ్రెసు మహాసభ అత్తిమాంజేరిపేట సమీపమునగల కర్లంబాకం గ్రామమునందు నిన్న జరిగింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గసభ్యులు డి. మునిరత్నం నాయుడుగారు సభ ప్రారంభించారు. జిల్లాబోర్డు సభ్యులు మాదిరాజు సుబ్రహ్మణ్యం రాజుగారు జాతీయ పతాకోత్సవం జరిపారు. జిల్లాబోర్డు అధ్యక్షులు ఎన్. పి. చెంగల్రాయ నాయుడుగారు సభకు అధ్యక్షత వహించారు. సుమారు రెండువేలమంది రైతులు హాజరయ్యారు.

అధ్యక్షులు ఉపన్యసిస్తూ, పల్లిపట్టు తాలూకాలోని ధాన్యంశిస్తులు అధికంగా వున్నవనిరి. ఈ శిస్తులను తగ్గించవలసిందని ప్రభుత్వానికి తెలియపరచు బాధ్యత మనపైవున్నది. రైతులు చాలా దుస్థితిలో వున్నారు. నేడు యీ సమావేశములో మన యిక్కట్లను కొన్ని సమగ్రంగా పరిశీలించి ప్రభుత్వానికి అందజేయవలయును" అనిరి. రైతులవద్ద ఒక సంవత్సరం శిస్తును ఋణంగా ప్రభుత్వం తీసుకొనదలచియున్నది. దానికి మనం ప్రతిఘటిస్తూ, రైతులవద్ద గాక మరి యితర పెద్దపెట్టుబడిదారులవద్ద ఒక సంవత్సరం ఆదాయాన్నో లేక వారు ప్రభుత్వానికి చెల్లించు ఒక సంవత్సరం అమ్మకపు పన్నైనా లేక ఒకసంవత్సరం ఆదాయపుపన్నైనా ఋణంగా వసూలు చేసుకొనునట్లు మనం తీర్మానాలు జరుపవలయునని అన్నారు. మహాసభల తీర్మానాన్ని ప్రభుత్వం తప్పక గుర్తిస్తుంది అనిరి.

ప్రతిఒక్క గ్రామంలోను రైతు కాంగ్రెసు సంఘాలు ఏర్పరచవలయుననీ, ప్రస్తుతం మదరాసు ప్రభుత్వంలో వ్యవసాయశాఖకు మంత్రిగా ఏ డాక్టరునో మరి యే యితరులనో నియమించుచున్నారనీ, వీరికి రైతులకష్టాలు బొత్తిగా తెలియవనీ అన్నారు. రైతులనుండే వ్యవసాయశాఖ మంత్రిగా నియమించవలయునన్నారు. అప్పటికిగాని రైతుల కష్టాలు తీరవన్నారు. జిల్లాబోర్డు అధ్యక్షులుగా వున్నంతకాలం రైతులకు కావలసిన సౌకర్యాలు తప్పకజేసెదనని హామియిచ్చారు.

డి. మునిరత్నం నాయుడు గారు మాట్లాడుతూ, జమీన్ రైతు కాంగ్రెసు చేసిన కృషిని సమీక్షచేశారు. ప్రస్తుతం మనదేశాన్ని ఎదుర్కొంటున్న క్లిష్టసమస్యలను వివరించి చెప్పారు. జమీన్ రైతుల శిస్తులను తగ్గించుటకు మనం తీవ్రకృషి జరుపవలయుననిరి. ఆంధ్రరాష్ట్రానికి తిరుపతి రాజధానినగరంగా చేయవలయునని మనం తీర్మానాలు చేయవలయు ననిరి.

మాదిరాజు సుబ్రహ్మణ్యం రాజుగారు వుపన్యసిస్తూ, జమీందారీలలోని శిస్తులకు ప్రభుత్వ ప్రాంతాలలోని శిస్తులకువున్న తేడాలను తెలియజేశారు.

పి. రాజగోపాలు నాయుడుగారు మాట్లాడుతూ, ప్రస్తుతం మనమదరాసు ప్రభుత్వం అమలుజరుపబోవుచున్న రైతులవద్దనుండి ఒకసంవత్సరం శిస్తును ఋణంమూలకంగా తీసుకొనబోవుచర్యను మనం ప్రతిఘటించవలయునంటూ భూమి శిస్తువిధానాన్ని విమర్శించారు. తమిళులు యీ జిల్లాలో చేయు ఆందోళనమును ఖండిస్తూ వారి చర్యలను అరికట్టుటకు మనం అందరం తీవ్రంగా పనిచేయ వలయుననిరి.

తర్వాత సభలో ఏకగ్రీవంగా యీ క్రింది తీర్మానాలు గావించబడినవి.

చిత్తూరుజిల్లాలో 100 కి 80 మంది తెలుగువారగుటచే దీనిని జె. వి. పి. రిపోర్టులోకూడ వివాదరహితమైన ప్రదేశముగా పరిగణించి ఆంధ్రరాష్ట్రములో చేర్చి నూతన రాజ్యాంగచట్టనిర్మాణములో పొందుపరచవలెను. తిరుత్తని, పుత్తూరు తాలూకాలలో అనధిక సంఖ్యాకులైన తమిళులు యీ జిల్లాను తమిళనాడులో చేర్చవలయునని దుష్ప్రచారములను యీ సభవారు తీవ్రంగా ఖండించుచున్నారు.

తరతరాలుగా జమీందారీ గ్రామాలలోని రైతులు అధిక పన్నులచే అవస్థపడుటను చూచి వాటి విముక్తికి [illegible] మద్రాసు ప్రభుత్వం శిస్తు తగ్గింపు చట్టం ఒకటి, జమీందారుల రద్దుచట్టం ఒకటి ప్రవేశపెట్టియుగూడ అవి ధాన్య తీరువాలుగల గ్రామములకు సవతితల్లిప్రేమ జూపి ఎట్టి ఆదరణ యివ్వకపోవడమును యీ సభవారు నిరసిస్తూ ధాన్యతీరువాలుగల గ్రామముల అభివృద్ధిని ప్రభుత్వము కోరునెడల తక్షణమే ధాన్యతీరువాలను రొక్కం తీరువాలుగా మార్చి శిస్తు తగ్గించుటకు యిందుకు సంబంధించిన ఉద్యోగస్థులకు వెంటనే ఉత్తరువులు జారీచేయవలయునని యీసభవారు కోరుతున్నారు.

అట్లుకానియెడ 1802 సంవత్సరపుధాన్యపుధరలను కట్టి దానిని రొఖముగా మార్చవలయునని కోరారు.

ప్రస్తుతము ధాన్యపు కంట్రోలు విధానము, అటు ప్రభుత్వోద్యోగుల లంచగొండి తనమునకు యిటు వ్యాపారస్తుల చీకటి వ్యాపారమునకు దోహదమిచ్చుచున్నది గాన, యీ ధాన్యపు కంట్రోళ్ళను శీఘ్రముగా తొలగించవలయునని కోరారు.

రైతులకు వలయు వ్యవసాయపనిముట్లు సకాలములో సక్రమ ధరలకు అందజేయవలయుననియు పంటలకు వలయు యెరువుల ధరలను ప్రభుత్వమువారు పెరిగించినవిధానమును నిరసిస్తు లోగడ మాదిరిగా సగము ధరను ఇండియా ప్రభుత్వము భరించుచూ, సగపు ధరకే అన్ని రకముల ఎరువులు రైతులకు సరఫరా చేయవలయునని కోరారు.

పంటల భీమాను అనతికాలములో మదరాసు రాష్ట్రప్రభుత్వము అమలుపరచగలందులకు తగుచర్య తీసుకొనవలయును.

(8) వెంకటాపురం కట్టక్రింద హరిజనవాడలో యిండ్లు సౌఖ్యములేక పెట్టుకొన్న మహాజర్లపై, వెంటనే తగుచర్య తీసుకొనవలయునని కోరారు.

ఈ తాలూకాలోకెల్ల ముఖ్యమైన వ్యాపార కేంద్రములు పొదటూరుపేట, అత్తిమాంజేరిపేట వీటికి రెంటికీమధ్య అనాదిగా రోడ్డు సరిగా లేనందున వ్యాపార నిమిత్తమునకేమి, వ్యవసాయనిమిత్తమునకేమి, పెద్ద యిబ్బందిగాయున్నది. కాన వెంటనే [illegible] తిరుప్పం, కోనసముద్రమునుమధ్య 3 మైళ్ల మార్గము వెంటనే రోడ్డు వేయవలయునని యీ సభవారు కోరుతున్నారు.

కొండివలసనుండి వనదుర్గాపురంవరకు 6 ఫర్లాంగులు రోడ్డు వేయవలయును. నెడిగల్లు గ్రామమునకుగల చెరువును వెంటనే మరమ్మతు చేయించవలెను.

తర్వాత ఆర్ సుబ్బరాయుడుగారి అభివందనములతో సభ ముగిసెను.

నారిళ్ల వెంకట్రామా నాయుడు గారు జిల్లాబోర్డు అధ్యక్షులు యన్. పి. చెంగల్రాయనాయుడు గారి గౌరవార్థం విందు చేయించారు. విందులో అనేకులు [illegible]న్నారు.

# 'ప్రభుత్వంవారు ఏమేమో చెయ్యలేదని విమర్శించటం కంటె ఏమి చేస్తున్నారో గమనించటం ముఖ్యం'

## మద్యనిషేధ విజయానికి ప్రజల తోడ్పాటు అవసరమని సంజీవరెడ్డిగారి వివరణ

విజయవాడ, డిశంబర్ 5: "మద్యనిషేధ విజయమునకై ప్రజలు సంపూర్ణముగా సహకరింపకుండుట విచారకరముగానున్నది. నిషేధ ఫలితముగా 17 కోట్ల రూపాయల ఆదాయము లోపించుట అటుంచి, మద్యనిషేధ శాఖపై ఒకకోటి ముప్పదిలక్షలు ఖర్చగుచున్నది. పూర్వము బీదలు మద్యముపై దాదాపు రూ 50 కోట్లు వ్యయపరచుచుండెడివారు. కాంగ్రెసు ప్రభుత్వము ఈ దుర్వ్యయము నరికట్టినది. ప్రజలీ కార్యక్రమమునకు క్రమముగా తోడ్పాటు నివ్వగలరను ఆశతో, ప్రభుత్వము తీవ్రచట్టములను చేయకుండా గనుపుచున్నది" అని మద్యనిషేధ మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి తమ కృష్ణాజిల్లా పర్యటనలో పలుచోట్ల తెల్పిరి.

శ్రీ సంజీవరెడ్డి మొన్నరాత్రి బందరు, గుడివాడ, కైకలూరు, దివితాలూకాల పర్యటనను ముగించుకొని బెజవాడ చేరిరి. నిన్నటి ఉదయం, మంత్రిగారిని ఆంధ్రరాష్ట్ర సినీ ఉద్యోగుల సంఘము తరఫున పి. హనుమంతరావు, జె. భీమారావు, ఎస్. పి. శర్మ, జి. వి. యస్. శాస్త్రి, కె. యస్. నారాయణగారలు కలసికొని, షాపుగుమాస్తా చట్టమును సినిమా ఉద్యోగులకుకూడా వర్తింపజేయగోరిరి. మంత్రిగారి విషయమై తప్పక ఆలోచింతుమని హామీనిచ్చిరి.

తదుపరి మంత్రిగారు ఆంధ్రరాష్ట్ర బీద రజక విద్యార్థి వసతిగృహ ఆవరణలో గాంధీజీ విగ్రహము నావిష్కరించిరి. బాపూజీ బీదలపాలిటి దేవుడనియు, మద్యనిషేధము గాంధీజీకి చాలా ప్రియతమమైన కార్యక్రమముగాన, రజకులీ కార్యక్రమములో పట్టుదలపనిచేసి ప్రభుత్వముతో సహకరింపవలెననియు మంత్రిగారనిరి. సురటి దుర్గాప్రసాదరావుగారు మంత్రిగారికి రజక విద్యార్థుల తరపున కృతజ్ఞత తెల్పిరి.

అనంతరం మంత్రిగారు తిరువూరు బయలుదేరిరి. సూకల వీరరాఘవయ్య, కొల్లిపర సూరయ్య, కాకాని వెంకటరత్నం, పేట బాపయ్య, లింగంనేని పెదసుంబరావు, మిద్దె రామకృష్ణయ్య, సబ్ కలెక్టర్ యం. యస్. శ్రీనివాసన్, మద్యనిషేధ డిప్యూటీకమీషనర్ పి. యల్. రామస్వామి నాయుడు, డిప్యూటీ ప్రొహిబిషన్ ఆఫీసర్ జి. వి. రంగారెడ్డి, స్పెషల్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ రామారావునాయుడు గారలు మంత్రిగారివెంట వెళ్ళారు.

కొండపల్లివద్ద మంత్రిగారికి, కాకాని వెంకటరత్నంగారికి, గ్రామ కాంగ్రెసు వారు సన్మానపత్రముల సమర్పించిరి.

కొందూరులో గ్రామ కాంగ్రెసువారు మంత్రిగారికి అల్పాహారవిందును చేసిరి. దగ్గరలోనున్న "లోయ" అటవీ ప్రాంతములో 500 ఎకరముల భూమి ఉన్నదనీ, దానిని ఈడిగవారి కివ్వవలెనని గ్రామస్థులు విన్నవించిరి.

కొందూరుగ్రామ సోషలిస్టుపార్టీ వారు మంత్రిగారికి సమర్పించిన ఒక విజ్ఞప్తిలో పంటలన్నియు తుపానువలన నాశనమైనవి కాన, శిస్తురెమిషన్లు నివ్వవలెననియు ఒక సంవత్సరపు శిస్తును ధరావతుగా రైతులవద్దనుంచి తీసుకొనవలెనని ప్రభుత్వము ఆలోచించుట ప్రస్తుతములో రైతులకు బాధాకరమగుననియు తెల్పిరి. బావుల మరమ్మతులకని ప్రభుత్వమువారిచ్చిన ధనసహాయము, అధికాహారోత్పత్తికి ఉపకరింపలేదు.-కాన ప్రభుత్వమేపంట చెరువులయొక్క బావులయొక్క మరమ్మతుకు పూనుకొనవలెను. మాధవవరం పాత చెరువును మరమ్మతుచేసినచో 2 వేల యకరము లదనముగా సాగులోనికి రాగలదు అని నివేదికలో సూచింపబడెను. కేవలము భూమిలేనివారికి మాత్రమేకాక, భూమిగల చిన్నరైతులకుకూడా రేషన్ కార్డుల నివ్వవలెననికూడ వారు విన్నవించిరి.

చెవుటూరు, వెంకటాపురం, కుంటముక్కల, పోలిసెట్టిపాలెం, చీమలపాడు వద్దకూడా మంత్రిగారిని ప్రజలు కలిసికొని బుడమేరు ప్రాజెక్టును తక్షణమే నిర్మింపవలెనని విన్నవించుకొనిరి.

మైలవరం పంచాయతీ బోర్డువారు, తమకు విద్యుచ్ఛక్తిని సప్లై చేయమని కోరిరి. అట్టిది ప్రస్తుతములో సాధ్యపడదని ఆంధ్రరాష్ట్రము వచ్చువరకు ఆగవలెనని మంత్రిగారు చెప్పిరి.

చీమలపాడులో, ప్రస్తుతము ఉన్న ఉర్దూపాఠశాలతోపాటు, తెలుగుపాఠశాలను కూడా పెట్టమని కృష్ణాజిల్లాబోర్డ్ అధ్యక్షులైన కాకాని వెంకటరత్నంగారిని ప్రజలుకోరిరి.

అనంతరం మంత్రిగారు తిరువూరు చేరి". ఆంధ్ర మహిళా ప్రాథమిక విద్యాశిక్షణ పాఠశాలను నడుపుచున్న శ్రీమతి ఎర్నేని దమయంతి, ఉపాధ్యాయిని శ్రీమతి లీలావతి, ఉపాధ్యాయుడు శ్రీ రాజా, శ్రీ గద్దె రంగయ్యనాయుడు స్థానిక అధికారులు కాంగ్రెసువాదులు మంత్రిగారికి స్వాగతమిచ్చిరి. భోజనానంతరము మంత్రిగారు పాఠశాల ఆవరణలో త్రివర్ణ పతాక ధ్వజప్రతిష్ఠను చేసిరి విద్యార్థినులు సూత్రయజ్ఞమును జరపిరి.-నిపుణులైన విద్యార్థినులకు మంత్రిగారు బహుమతు లిచ్చిరి. పాఠశాల నిర్వాహకులు మంత్రిగారికి సన్మాన పత్రమును సమర్పించి, [illegible] యొకదానిని బహూకరించిరి. మంత్రిగారు శ్రీ రంగయ్యనాయుడు, శ్రీమతి దమయంతి గారలను ఉపాధ్యాయ వర్గమును, విద్యార్థినులను అభినందించుచూ కొందరీ ప్రాథమిక విద్యకు అర్థము లేదని విమర్శించుచుండగా, దమయంతీదేవిగారి వంటివారు, ఆ శిక్షణలోని ప్రయోజనము గ్రహించి పాఠశాలను నిరాఘాటముగా కొనసాగించుట ముదావహమనిరి.

సాయంత్రము తిరువూరు తాలూకా కాంగ్రెస్ వారు మంత్రిగారి గౌరవార్థమై అల్పాహార విందును చేసిరి. విందు తర్వాత, శ్రీ కొల్లిపర సూరయ్య అధ్యక్షత క్రింద బహిరంగసభ జరిగెను. ముందుగా తాలూకా కాంగ్రెసు వారు తిరువూరు పట్టణ కాంగ్రెస్ వారు మంత్రిగారికి సన్మాన పత్రముల సమర్పించిరి. పట్టణ కాంగ్రెసువారు తమ సన్మాన పత్రములో, హైదరాబాదు సంస్థానముతో, సరిహద్దులకు పదిమైళ్ళ వరకు మద్యనిషేధపు 'బెల్టు'ను ప్రవేశపెట్టవలసినదిగా మద్రాసు ప్రభుత్వము సంస్థాన ప్రభుత్వమును కోరవలెనని సూచించిరి. తిరువూరులో కొందరు సంస్థానములోనికి పోయి త్రాగివచ్చుటో, లేక సారాయిని చాటుగా తెచ్చుకొనుటో, లేక సంస్థాన సరిహద్దులలో మద్యవ్యాపారమును చేయుటో జరుగుచున్నది. కాన ఇట్టి 'బెల్టు' అత్యవసరము. ఇట్టి బెల్టు లేకుండుటవలన, అనేకులు జైళ్లకు పోవుట, జరిమానాలు చెల్లించుట, అనేక బాధలను పడుట సంభవించుచున్నది. ప్రభుత్వమువారు నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రారంభించుట నిషేధ కార్యక్రమ విజయమునకు తోడ్పడగలదని సన్మాన పత్రములో సూచించిరి.

శ్రీ సంజీవరెడ్డి, మద్యనిషేధమున కెల్లరూ తోడ్పడవలెనని కోరుచూ, మద్యనిషేధము విమర్శించువారలకు సమాధానంగా యిట్లు ప్రసంగించిరి. "మద్యములపై లభించుధనమును విద్యావ్యాప్తికై వినియోగింపవలెనని కొందరనుచున్నారు. ప్రభుత్వమునకు ప్రజల డబ్బూ సమానమే. ఒక వసూరుని త్రాగించి, మరొక పసిబాలునికి విద్య నేర్పించుటకు ఏ తల్లియూ ఒప్పుకొనదు" అని మంత్రిగారన్నారు. ప్రజలే మద్యనిషేధము నమలు జరుపవలెనని మంత్రిగారు కోరుచూ, ఎవరు అక్రమములు చేయుచున్నారో ప్రజలకే తెలియును. కాన, వారు, అక్రమ చర్యలను చేయువారికి సానునయముగా బుద్ధిగరుపవలెననిరి. సరిహద్దులో, మద్యనిషేధపు 'బెల్టు'ను ప్రవేశ పెట్టవలెనని, హైదరాబాదు ప్రభుత్వమును, త్వరలో కోరబోవుచున్నామనిరి.

"ప్రభుత్వమువారు ఏమేమో చేయలేదని విమర్శించుటకంటె, ఏమేమి చేయుచున్నారో గమనించుట ముఖ్యమని మంత్రిగారు హెచ్చరించిరి. మద్యనిషేధము, ముఖ్యముగా బీదలకు లాభకరమైనది. జమీందారీ రద్దుచట్టము రైతులకు చాలా మేలుచేయును. జమీందార్ల కిచ్చు పరిహార వ్యయమును ప్రభుత్వమే భరించుచున్నది. షాపు గుమస్తా చట్టమువలన బీదగుమాస్తాలు, నౌకర్లు బాగుపడుదురు. ఇట్లే అనేకపనులను ప్రభుత్వము చేసినది ఇంత తక్కువకాలములో ఏ దేశ ప్రభుత్వమును, ఇంతకంటె చేసినదిలేదు." అని మంత్రిగారన్నారు.

"కొందరు, పటేల్, నెహ్రూలు పెట్టుబడిదారులకు దాసులైరని ప్రచారము చేయుట చాలా హాస్యాస్పదమనుచూ, ఇన్నివిధంగా స్వార్థరహిత సేవను చేయుచున్నవారిని ఇట్లనుట తప్పని మంత్రిగారనిరి. పటేల్, నెహ్రూ గార్లకు నేడు ధనసంపాదన చేయు నీచస్థితి రాలేదనిరి. దేశస్థితిని క్రమక్రమముగా సంస్కరింపవలెను. ఈ విమర్శకు లిట్లనుచుండగా, పెట్టుబడిదారులు-భాగ్యవంతులుకూడా ప్రభుత్వమును నిందించుచున్నారు. ఏమైనప్పటికిని ప్రభుత్వము మెల్లె మెల్లెగా ప్రజా క్షేమానుకూల సంస్కరణ లన్నింటిని చేయకమానదు. ప్రజలు ఓర్పు వహింపవలెను. దౌర్జన్యముతో ఏ పనీ సాధింపలేరు. దానివలన మంచి పనులకుకూడా అంతరాయము కల్గును. కమ్యూనిస్టులు తమ సిద్ధాంత, కార్యక్రమములను ఒప్పుకొనని వారందరునూ చంపుటకు పూనుకొనిరి. కాని ప్రభుత్వమునకు వ్యక్తి స్వాతంత్ర్యములోను, అహింసలోనూ విశ్వాసము ఉన్నది. చిక్కిన వ్యతిరేకులను కమ్యూనిస్టులు చంపుచున్నారు. కాని చిక్కిన కమ్యూనిస్టులను ప్రభుత్వము చంపుటలేదు. దానికి కారణము, ప్రభుత్వమునకు గాంధీజీ అభిప్రాయములపై గల గౌరవమే. ఈ సంగతిని కమ్యూనిస్టులు గమనించి, తమ హింసాపద్ధతులను మానుకొనవలెనని మంత్రిగారు హెచ్చరించిరి.

శ్రీ సూకల వీరరాఘవయ్య, శ్రీ కొల్లిపర సూరయ్య కూడా మాట్లాడిరి. తిరువూరు తాలూకా కాంగ్రెసు కార్యదర్శి వందనములు సమర్పించిన తరుపరి సభ ముగిసెను మంత్రిగారు విజయవాడకు ప్రయాణమై వచ్చిరి. (స్వ. వి)

## కమ్యూనిస్టు చైనాకు బర్మా పరిగణన

రంగూన్, డిసెంబర్ 6: "క్రిస్మస్ పండుగలోపు — బర్మా కమ్యూనిస్టు చైనాను గుర్తించటం [illegible] వచ్చును" అని బర్మా విదేశాంగమంత్రి మాంగ్ కేడు ప్రకటించాడు.

కొమింటాంగ్ పక్షం వాళ్ళకి ఆశ్రయమివ్వవద్దని చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం తమ కేమీ హెచ్చరిక చేయలేదనీ, సరిహద్దులుదాటి ఎవరూ రాకుండా కట్టుదిట్టాలు చేయబడినవనీ అతను వెల్లడించాడు.




Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No7, ThambuChetty St., G. T. Madras.